20.1.1995 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి : 67. సంచిక : 3. విడిప్రతి : రు. 2.00 లు
Phone : 27354. Regd No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు
జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



### అన్నా? వదినా? అల్లుళ్లా?

# ప్రభుత్వాన్ని నడుపుతున్నదెవరు?

అధికారం పంచుకోవడం కోసం తెలుగుదేశంలో అంతర్గతంగా జరుగుతున్న పోరాటం రాష్ట్ర ప్రభుత్వ నిర్వహణను అస్తవ్యస్తం చేస్తున్నది; అయోమయం సృష్టిస్తున్నది. చాలా దురదృష్ట వంతమైన పరిణామమిది. ఎన్నికలలో ఓటర్లు తెలుగుదేశం పార్టీకి తిరుగులేని బలం చేకూర్చి పెట్టారు; ఎన్టి రామారావును శక్తి వంతమైన నాయకుడిగా తీర్చిదిద్దారు. ప్రజల దృష్టిలో ప్రభుత్వ నేత, పాలకుడు ఎన్టిఆర్ ఒక్కరే. తెలుగు ప్రజల వాంఛితం అది. కానీ ఓటర్లిచ్చిన ఆ తీర్పు, తెర వెనుక జరిగే భాగోతంలతో తల్లక్రిందు లౌతున్నది.

తమ తమ సీట్లలో ముఖ్యమంత్రి, మంత్రులు సరిగ్గా కుదురు కోకముందే అధికారం కోసం అంతర్గతంగా పోరాటం ప్రారంభమై పోయింది. ముఖ్యమంత్రి సతీమణి శ్రీమతి లక్ష్మిపార్వతి, ఇద్దరల్లుళ్లు డాక్టర్ వెంకటేశ్వర రావు, చంద్రబాబు నాయుడులు తమ పెత్తనమే సాగాలని పంతం పట్టి పరిపాలనా సౌధాన్ని పునాదులతో సహా కదిలించి పారేస్తున్నారు. ఈ విషయంలో శ్రీమతి లక్ష్మిపార్వతి ఒక అడుగు ముందుకు వేస్తున్నారు. ఎన్నికల సమయంలో ఆమె -

తాను ఎన్టిఆర్ ధర్మపత్నిగా ఇంటి పట్టునే వుంటానని, ఆయనకు సేవ చేసుకొంటూ బ్రతుకు తానని, రాజకీయాలలో జోక్యం పెట్టుకోనని పదే పదే చెప్పారు. కాని వాస్తవంలో అందుకు విరుద్ధంగా జరుగుతున్నది. ఆమెకు తెలియకుండా, ఆమె ప్రమేయం లేకుండా ఒక్క ఫైలు పై ఎన్టిఆర్ సంతకం పెట్టినా అంచలో అలుక, ఆగం సర్వసాధారణమై పోయాయి. ఆమె గీసిన గీత దాటడానికి ఎన్టిఆర్ హడలి పోతున్నారు. ప్రభుత్వం మీద, పార్టీ మీద తనకున్న పట్టును నిరూపించడానికి ఆమె ఏ అవకాన్నీ వదలి పెట్టడం లేదు. ఇందుకోసం ఆమె జిల్లాలలోనూ విస్తృతంగా పర్యటిస్తున్నారు. ఎన్టిఆర్‌తో కలసి వెళ్లే పర్యటనల కంటె, తాను విడిగా సందర్శించే కార్యక్రమాలే ఎక్కువగా వుంటున్నాయి. జిల్లాల నుంచి వచ్చే ఎమ్మెల్యేలు, కార్యకర్తలను రామారావు గారి దగ్గరకు పంపి, వదినను తమ జిల్లాలకు పంపమని వారిచేత అడిగిస్తున్నారామె. వారి వత్తిడి తట్టుకోలేక పరేసవక తప్పడం లేదాయనకు. అయితే ఆమె అట్లా ఒంటరిగా జిల్లాలకు వెళ్లడం; అక్కడ ఎమ్మెల్యేలు, మంత్రులు పోటీలు పడి స్వాగత ఏర్పాట్లు చేయడం ఇటు రామారావు గారికి కాని, అటు ఆయన ముద్దులల్లుళ్లకు కాని నచ్చడం లేదు. అయితే ఆమెకు ఎదురు చెప్పే సాహసం ముఖ్యమంత్రిలో లేదు.

తమ గొంతు చాలడం లేదని అల్లుళ్లిద్దరూ కలసి, రామారావు కుమారులు, కుమార్తె లందర్నీ ఏకం చేశారు. సంతాన మంతా కలిసి వచ్చి తనను నిలదీస్తుంటే రామారావు గారికి సంకటంగానే వుంది. కాని ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి.




టెక్కలి ఉప ఎన్నికలో పోటీకి శ్రీమతి లక్ష్మిపార్వతి రెడీ కావడం అల్లుళ్లకు మరీ కంటగింపుగా వుంది. ఏదో దూరాలోచనతోనే ఆమె పోటీకి సిద్ధపడుతున్నారని వీరిభయం. ముఖ్యమంత్రిత్వం మారే పరిస్థితి ఎదురైతే ఆమె పోటీకి వస్తుందన్నది వీరి దిగులు.

ఈ పరిస్థితులలో ప్రభుత్వాన్ని నడిపేదెవరో, అధికారం ఎవరి చేతిలో వుందో తెలియక మంత్రులు సతమతమై పోతున్నారు. అన్న, వదిన, ఇద్దరల్లులలో ఎవరిని మంచి చేసుకోవాలో అర్థం కాక తనక లాడి పోతున్నారు. నాలుగు స్తంభాలాట వలె నలుగురి దగ్గరకూ పరుగులు పెడుతున్నారు. నలుగురినీ సమదృష్టితో కీర్తిస్తున్నారు.

ఇదిట్లా వుంటే ముఖ్యమంత్రి శ్రీ ఎన్టి రామారావు మతిమరపుతో బాధపడుతున్నారన్న వదంతులు వ్యాపిస్తున్నాయి. సంతకం చేసిన ఫైళ్ళ సంగతే ఆయన మర్చి పోతున్నారట. ఎప్పటి కప్పుడు ప్రక్కన ఎవరో ఒక అధికారి నిలబడి ఇదిట్లా అదట్లా అని చెప్తే కాని ఏదీ గుర్తుకు రావడం లేదట. ఈ వార్త బయటకు పొక్కడంతో అధికారులలో అయోమయం నెలకొంటున్నది. ఎప్పుడేమి జరుగుతుందో, ఏ ఫైలు

కొరవ 5 పేజీలో

# పాత శత్రువులతో దోస్తీ!

ఎన్టి రామారావు గారికి గతంలో శత్రువులుగా వుండిన సినిమా నటులు, పారిశ్రామిక వేత్తలు, రాజకీయాలతో పెద్దగా సంబంధం లేని ముఖ్యమైన వ్యక్తులను మచ్చిక చేసుకొనేందుకు శ్రీమతి లక్ష్మిపార్వతి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. సినీ నటులు అక్కినేని నాగేశ్వర రావు, కృష్ణల విషయంలో ఆమె ఇప్పటికే సఫలీ కృతురాలైనారు.

అక్కినేని నాగేశ్వర రావుకు, రామారావు గారికి సినిమా రంగంలో వున్నప్పటి నుంచే విబేధాలున్నాయి. ఆ పాత శత్రుత్వం మనసులో పెట్టుకొని రామారావు గారు 1983 లో ముఖ్యమంత్రి కాగానే, నాగేశ్వర రావుకు

**అర్ధాంగి ఒత్తిడితో అక్కినేని, కృష్ణలతో ఎన్టీఆర్ సర్దుబాటు**

చెందిన అన్నపూర్ణ స్టూడియోస్‌కు ప్రభుత్వ మిచ్చిన స్థలాన్ని రద్దు చేయడానికి ప్రయత్నించారు. దానితో ఇద్దరి మధ్యా స్పర్థలు రగుల్కొన్నాయి. ఒకరి పై ఒకరు విమర్శనాస్త్రాలు సంధించు కున్నారు. అయితే అక్కినేని మాత్రం ఎప్పుడూ రామారావుకు ప్రతిగా రాజకీయాలలోకి వచ్చే ప్రయత్నం చేయలేదు. అట్లని రాజీపడి సర్దుకోలేదు. మనస్పర్థలు అట్లే వుండినాయి. ఇప్పుడు ఎన్టిఆర్ మళ్లీ ముఖ్యమంత్రి అయినా ఆయన కలవలేదు.

కాని రెండు వారాల క్రితం

కొరవ 5 పేజీలో

# కోట్ల పదవి వెనుక ఎమ్మెల్సీ టిక్కెట్ల దురాశ?

రాష్ట్ర కాంగ్రెస్‌లోని ముఠా తగాదాలు సిఎల్పి నాయకుడి ఎంపికతో మరొకసారి రచ్చకెక్కాయి; పార్టీ మళ్లీ భ్రష్టు పట్టింది. సిఎల్పి నాయకుడిగా శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి ఎన్నిక కావడం డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి వర్గానికి ఇష్టం లేదు. అయితే ఆయనను ఎన్నికను ప్రభావితం చేసే బలం లేదు. కేవలం నలుగురు ఎమ్మెల్యేలే ఆయన పక్షంలో వున్నారు. అది తెలిసే సిఎల్పి సమావేశంలో రహస్య బ్యాలెట్ పద్ధతిన ఎన్నిక జరగాలని పట్టుబట్టారు వారు. కాని కేంద్రం నుంచి వచ్చిన పరిశీలకుడు ప్రొఫెసర్ కురియన్ అందుకు సమ్మతించలేదు. రచ్చ రేగింది. దివాకర రెడ్డి, వై.ఎస్. వర్గం ఎమ్మెల్యేలను హేళన చేశారు. ఇద్దరూ కలబడి తిట్టుకున్నారు. ఎంత రచ్చ రేపినా, కోట్ల విజయభాస్కర రెడ్డి ఎన్నిక జరిగి పోయింది. ఆది ఎన్నిక కాదు - ఎంపిక! వెంటనే ఈ ఎంపిక తమకు సమ్మతం కాదని రాజశేఖర రెడ్డి తిరుగుబాటు ప్రకటన చేశారు. ప్రజలు చెప్పుతో కొట్టినా తమకు మాత్రం [illegible] కాంగ్రెస్ నాయకులు స్పష్టంగా రుజువు చేశారీ ప్రహసనంలో.

**సిఎల్పి నాయకత్వం స్వీకరించడానికి కోట్ల ఎందుకు అంగీకరించినట్లు?**

ఏ మాత్రం గుర్తింపు, గౌరవం, విలువలేని ఈ పదవి కోసం మాజీ ముఖ్యమంత్రి వర్యులు అంత గట్టిగా పట్టుబట్టి సాధించు కోవడంలోని అంతర్యం ఏమిటి? కేవలం 26 మంది వున్న కాంగ్రెస్ శాసన సభా పార్టీకి ప్రతిపక్షం హోదా ఇవ్వడానికి ఎన్టిఆర్ తిరస్కరించారు. అందువల్ల సిఎల్పి నాయకుడు కాంగ్రెస్ పార్టీ వరకే పరిమితం; ఏ హోదా అనుభవించలేదు. అయినా దీని కోసం కోట్ల వారు ఆరాట పడడానికి కారణం - ఏడాదిలో జరుగనున్న ఎమ్మెల్సీ టిక్కెట్ల పంపకమేనని పరిశీలకుల వూహ. పార్లమెంట్ టిక్కెట్ల పంపిణీ సమయంలో ఢిల్లీ నాయకులు కేవలం పేరుకి అధ్యక్షుడు, సిఎల్పి నాయకుడిని మాత్రమే చర్చలకు పిలుస్తారని, తద్వారా తాను పెద్ద కోటా కొట్టేయడానికి విజయ భాస్కర రెడ్డి పథకం వేశారని వూహ.

అంతకు మించి ఆయన ఆరాటానికి కారణం కన్పడడం లేదు. నిన్నటి వరకూ ముఖ్యమంత్రిగా చేసిన వ్యక్తి, ఈ రోజు అదే సభలో గుర్తింపు కూడా లేని పార్టీ నాయకుడిగా ప్రభుత్వ పక్షాన్ని ఎదుర్కోవలసి

కొరవ 5 పేజీలో

# తారాజువ్వ వలె దూసుకపోతున్న మాగుంట కుటుంబం

వ్యాపార, పారిశ్రామిక రంగాలలో తారాజువ్వల వలె నింగికి ఎగిరి వెళ్తున్న నెల్లూరు సంపన్న కుటుంబాలు రెండే రెండు - ఒకరు గునుపాటి వెంకట కృష్ణారెడ్డి (టి.వి.కె.), రెండవ వారు మాగుంట సోదరులు. నెల్లూరు స్థాయిలోనే కాదు - రాష్ట్ర పరిధిలో చూసినా ఈ రెండు కుటుంబాల పురోగతి వేగంతో మరెవ్వరూ అందుకోలేక పోతున్నారు. టివి కృష్ణారెడ్డి గారు ఒక్క విద్యుత్ రంగం విద్యనను మాత్రం నమ్ముకొని మెట్టు మెట్టుగా పైకి ఎక్కి పోతుంటే; మాగుంట సోదరులు పది పడవలకు కాళ్లు ఆనించి వ్యాపార సాగరంలో జెట్ స్పీడుతో దూసుక పోతున్నారు.

మాగుంట సోదరుల బాలాజీ గ్రూప్ ఈ రోజు దక్షిణ భారతదేశంలోనే అతి ముఖ్య పారిశ్రామిక కూటమిగా గుర్తింపు పొందింది. విస్కీ తయారీ, పంపిణీ, రొయ్యల పెంపకం, స్టీమర్ల నిర్వహణ, స్టీల్ ప్యాకేజింగ్ ప్రింటింగ్ వంటి పరిశ్రమల నిర్వహణ వారి ప్రధాన కార్యకలాపం. గత రెండేళ్లలో బాలాజీ గ్రూప్ టర్నోవర్ ఏడాదికి 300 కోట్ల నుంచి 600 కోట్లకు పెరిగింది. రెండేళ్లలో గ్రూప్ టర్నోవర్‌ను రెట్టింపు చేసిన పారిశ్రామిక కుటుంబాలు దేశంలోనే వేళ్ల మీద లెక్క పెట్ట దగి వుంటాయి.

## రానున్న ఐదేళ్లలో 1500 కోట్ల వార్షిక టర్నోవర్ లక్ష్యం- హోటళ్ల నిర్మాణానికి 400 కోట్లు పెట్టుబడి పెట్టబోతున్నారు

రానున్న ఐదేళ్లలో, అంటే 2000 సంవత్సరానికి తమ టర్నోవర్‌ను 1500 కోట్లు దాటించాలని లక్ష్యంగా పెట్టుకొని కృషి చేస్తున్నారు. ఆ లక్ష్యం నెరవేరితే మాగుంట సోదరులు దేశంలో ముఖ్యమైన పారిశ్రామికులుగా గుర్తింపబడతారు.

బాలాజీ గ్రూప్ తరపున ప్రారంభిస్తున్న తాజా విస్తరణ పథకం - హోటళ్ల పరిశ్రమ. మౌంట్ రోడ్డులోని అబిడ్స్ ఐరీలో మాగుంట ఒబ్రాయ్ పేరుతో ఫైవ్ స్టార్ సూపర్ డీలక్స్ హోటల్ నిర్మిస్తున్నారు. 1996 ఆఖరుకు పూర్తయ్యే ఈ హోటల్‌లో 333 గదులుంటాయి. సాంకేతిక పరిజ్ఞానం, నిర్వహణ ఒబ్రాయిలు చూస్తారు. పెట్టుబడి 150 కోట్లు.

దీనితో పాటు కోయంబత్తూరులో 150 గదుల ఫోర్ స్టార్ హోటల్ నిర్మిత మౌతున్నది. తర్వాత దశల వారీగా మద్రాసు, బెంగుళూరు, పూనా వంటి నగరాలలో ఇదే స్థాయి హోటళ్లు నిర్మిస్తారు. వీటన్నింటికి కలిసి పెట్టుబడి 250 కోట్లు.

అబిడ్స్ ఐరీలోని మాగుంట ఒబ్రాయ్ హోటల్ క్రింది అంతస్తులను వ్యాపార సంస్థల షోరూంలకు ఇస్తారు. 2 లక్షల 50 వేల చదరపు అడుగుల విస్తీర్ణంలో షోరూంలు కడతారు. ఈ షోరూంల అమ్మకం ద్వారా కనీసం

### వ్యాపార లోకం

80 కోట్ల రూపాయల లాభం రాగలదని అంచనా. అంటే హోటల్‌కయ్యే పెట్టుబడిలో సగం మేరకు మొదటనే తిరిగి వచ్చేస్తుందన్న మాట.

హోటల్ విభాగం నిర్వహణకు బాలాజీ హోటల్స్ అండ్ ఎంటర్‌ప్రైజస్ లిమిటెడ్ అనే ప్రత్యేక కంపెనీని ఫ్లోట్ చేశారు. దీని పేరుతో త్వరలో 126 కోట్ల పబ్లిక్ ఇష్యూ వస్తున్నది. ఒక్కొక్క షేరుకు 125 రూపాయల ప్రీమియం నిర్ణయించారు. 150 రూపాయల ప్రీమియంతో మల్టీ కన్వర్టబుల్ డిబెంచర్లనూ విడుదల చేస్తారు. వాటి విలువ ఒక్కొక్కటి 1350 రూపాయలు.

హోటళ్లతో పాటుగా బాలాజీ గ్రూప్ 'సింగపూర్ కారిడార్' అనే ఇండస్ట్రియల్ ఎస్టేట్ నిర్మించ బోతున్నది. ఇందులో స్పిక్ కంపెనీ అధినేత శ్రీ ఎ.సి. ముత్తయ్య కూడా భాగస్వామి. వెయ్యి కోట్ల పెట్టుబడితో నెలకొల్పనున్న ఈ ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో అంతర్జాతీయ స్థాయి పరిశ్రమల స్థాపనకు సౌకర్యా లుంటాయి. దాదాపు ఆరు వేల కోట్ల రూపాయల పరిశ్రమలు ఇందులో స్థాపింప బడతాయని అంచనా.

బాలాజీ గ్రూప్ తరపున గోవాలో వున్నడిస్టిలరీ సామర్థ్యాన్ని నెలకు 50 వేల కేసుల నుంచి లక్ష కేసులకు పెంచుతున్నారు. మద్రాసులోని పూనమల్లిలో వీరికొక పెద్ద డిస్టిలరీ వుంది. ఒంగోలు జిల్లా సింగరాయ కొండలో మరొక ఆధునిక డిస్టలరీ నిర్మిస్తున్నారు.

మహారాష్ట్రలో బాలాజీ గ్రూప్ విస్కీ పంపిణీలో గుత్తాధిపత్యం కల్గి వుంది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రొహిబిషన్ వల్ల పంపిణీ వ్యాపారం పోయినా, మహారాష్ట్ర ఆ కొరతను తీరుస్తుందని అంచనా.

రానున్న ఐదేళ్లలో ఈ కార్యకలాపాలన్నీ సమన్వయం చేసి, దేశంలోని అతి పెద్ద పారిశ్రామిక సంస్థలలో ఒకటిగా ఎదగాలన్నది మాగుంట సోదరుల లక్ష్యం. అల్ప స్వల్ప రాజకీయాలలో తలదూర్చి సమయం వృధా చేసుకోకుంటే వారి లక్ష్యసాధన పెద్ద కష్టం కాదు.

# కువైట్ కంటే ప్రమాదకరమైన బ్లో అవుట్!

తూర్పు గోదావరి జిల్లా పాశర్లపూడి ఆయిల్ బావి నుంచి నింగికి పువ్వెత్తున ఎగిసిన ఆరని జ్వాల ప్రపంచంలోనే అరుదైనదని నిపుణుల అభిప్రాయం. 60 మీటర్ల ఎత్తులో - దాదాపు రెండు వందల అడుగులు - ఆకాశాన్నంటు తున్నట్లు కన్పడుతున్న ఆ మంటను ఎట్లా ఆర్పాలో అర్థం కాక పెద్ద పెద్ద కొమ్ములు తిరిగిన సాంకేతిక నిపుణులే తలలు పట్టుకొంటున్నారు. దీని కోసం అమెరికా నుంచి వచ్చిన నీల్ ఆడమ్స్ - 1991 లో ఇరాక్ బాంబుల వల్ల కువైట్‌లో చెలరేగిన బ్లో అవుట్‌ల కంటే ఇది అతి పెద్దదని, తాను ఇంత ఉధృతిని మరెక్కడా చూడలేదని చెప్పారు. ఈ జ్వాల, దాదాపు 15 కిలో మీటర్ల దూరానికి కూడా స్పష్టంగా కన్పిస్తున్నది. రోజుకు పది లక్షల ఘనపుటడుగుల సహజ వాయువు దీనివల్ల మండిపోతున్నదని అంచనా.

వారం రోజులుగా మంటలు అదుపు చేయడానికి ఒఎన్‌జిసి అధికారులు చేస్తున్న ప్రయత్నాలేవీ ఇప్పటి వరకు ఫలించలేదు. 8 ఎకరాల నేలలో పెద్ద చెరువు త్రవ్వి, అందులో నీళ్లు నిల్వచేసి, నిముషానికి 10 వేల గ్యాలన్ల నీరు మంట పైకి విరజిమ్ముతున్నారు. ఇంత నీళ్లు [illegible] ఈ నీటి గొడుగు క్రింద రక్షణ కల్పించుకొని నిపుణులు మంటకు వంద అడుగుల దూరం వరకు వెళ్లగల్గారు. ఇదే పద్ధతిలో మండుతున్న బావిని సమీపించి, చెల్పుతున్న పరికరాలు మార్చి, కొత్త వాటితో గొట్టపు బావికి క్యాప్ బిగించడం ద్వారా జ్వాలను ఆర్పాలన్నది పథకం. ఇందుకోసం [illegible] పరిధిలో మూడు వేల మీటర్ల లోతున మరొక బావి త్రవ్వి; బురద, బాక్సైట్ విశ్రమం అందులోకి పంప్ చేసి, గ్యాస్ ఒత్తిడి తగ్గించడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఎంత ప్రయత్నించినా, ఈ పనులన్నీ పూర్తయ్యే సరికి కనీసం రెండు నెలల వ్యవధి పడుతుందని అంచనా.

ఈ మండే బావి చుట్టు ప్రక్కల గ్రామాలను ఖాళీ చేసి వెళ్ల పోయారు ప్రజలు. 7 వేల మంది ఇట్లా వలసపోయి వుంటారని అంచనా. కొన్ని వేల కొబ్బరి చెట్లు మాడిపోయాయి. రొయ్యల చెరువుల్లోని నీరు ఆవిరై పోయింది.

# జపాన్ భూకంపం నష్టం 4 లక్షలా 20 వేల కోట్లు?

17 తేది జపాన్ దేశంలోని రేవు పట్టణం - కోబ్ నగరంలో జరిగిన భూకంపం కనీ వినీ ఎరుగని విధ్వంసాన్ని సృష్టించింది. 2014 మంది మరణించారు; 11,977 మంది గాయపడ్డారు ; 1058 మంది ఇంకా కన్పించడం లేదు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఇంత పెద్ద భూకంపం చూడలేదని చెప్తున్నారు. కేవలం 20 సెకండ్ల వ్యవధిలో ఆకాశ హర్మ్యాలను కూల్చి పారేసింది; రైలు పట్టాలు ప్లాస్టిక్ తీగల వలె మెలికలు తిరిగాయి. రోడ్డు బ్రిడ్జిలు రాళ్ల కుప్పలుగా మారాయి. తాము సాధించిన సాంకేతిక పరిజ్ఞానం ద్వారా భూకంపాలు ఎన్ని వచ్చినా అస్తి నష్టం వుండదని గప్పాలు కొట్టిన జపాన్ శాస్త్రవేత్తలను పరిహాసం చేస్తూ, విలయం సృష్టించింది భూ ప్రకంపనం.

నష్టం అంచనాలు వింటే గుండెలు పగిలి పోతాయి. సైటో అనే ఆర్థిక నిపుణుడు నష్టాన్ని 143 బిలియన్ డాలర్లు ( రమారమి 4 లక్షలా 20 వేల కోట్ల రూపాయలు) గా అంచనా వేశాడు. జపాన్ స్థూల జాతీయ ఉత్పత్తిలో 3 శాతం మొత్తం ఇది. దీని తోపాటుగా రానున్న ఆరు నెలల్లో జాతీయోత్పత్తిలో మరొక 0.7 శాతం నష్టం వుంటుందని అంచనా. శిథిలమైన ఈ నగరాన్ని పునర్నిర్మించ డానికి ఎంత వ్యవధి పడుతుందన్నదీ వూహించ లేకున్నారు.

అయితే జపాన్‌కున్న ఆర్థిక వనరుల దృష్ట్యా ఈ నష్టాన్నుంచి కోలుకోవడం వారికంత కష్ట మన్పించక పోవచ్చు. అప్పుడే వారి కేంద్ర ప్రభుత్వం పునరావాసం కోసం 20 బిలియన్ డాలర్లు (60 వేల కోట్ల రూపాయలు) కేటాయించ బోతున్నది. ఇందు కోసం వారు బడ్జెట్‌కు అదనపు గ్రాంట్లు తయారు చేస్తున్నారు. ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించుకొని నిధులు సమీకరించా లన్నది వారి తలంపు. రానున్న ఆరు నెలల్లోనే మొత్తం నగరాన్ని పునర్నిర్మాణం చేస్తారు. ఏ ఇతర దేశం నుంచీ వారు సహాయం ఆశించడం లేదు. వారి ఆర్థిక స్తోమత అది!

ఇండియాకు ఇంత నష్టం వస్తే, దాన్ని పూడ్చడానికి ఆరు దశాబ్దాలు కూడా చాలవు.

# ఆచితూచి అడుగేయడం షేర్ల కొనుగోలు దార్లకు క్షేమం!

### సింగపూర్ కారిడార్- మలేషియన్ల రాక!

మాగుంట సోదరులు, స్పిక్ ముత్తయ్య భాగస్వామ్యంతో నిర్మించ బోతున్న మద్రాస్ ఇండస్ట్రియల్ పార్క్ అనబడే సింగపూర్ కారిడార్ స్థాపనను పరిశీలించడానికి రెండు అతి పెద్ద మలేషియా కంపెనీల ఎగ్జిక్యూటివ్‌లు ఈ నెలాఖరులో మద్రాసుకు వస్తున్నారు. పోలింగనల్లూరులో నిర్మితమౌతున్నది ఈ పార్కు. ఇందు కోసం 200 ఎకరాల స్థలం కేటాయించింది తమిళనాడు ప్రభుత్వం.

### 25 జిల్లాలలోనే పరిశ్రమలన్నీ కేంద్రీకృతం

సరళీకృత ఆర్థిక విధానాల వల్ల అపరిమిత వేగంతో జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధి దేశమంతటికీ లాభించడం లేదు. బెంగుళూరు, బొంబాయి, కలకత్తా, హైదరాబాదు, మద్రాసు వంటి 25 నగరాలలో 71 శాతం కంపెనీలు రిజిష్టరైనాయి. దేశంలో మొత్తం 3 లక్షలా 5 వేలా 791 కంపెనీలు రిజిష్టరైనాయని లెక్కలు చెప్తున్నాయి. ఇందులో 71 శాతం పరిశ్రమలు 25 జిల్లాలకు లేదా నగరాలకు పరిమిత మౌతున్నాయి. దేశంలో మొత్తం జిల్లాల సంఖ్య 467. దీనివల్ల భవిష్యత్‌లో ఎటువంటి పారిశ్రామిక అసమతౌల్యం చవి చూడవలసి వస్తుందో వూహించ లేము.

### ఇప్పట్లో రికవరీ సాధ్యం కాదు!

### ఎస్సార్ ఆయిల్ ఇష్యూ- ఆదరణ వుండదా?

1860 కోట్ల మెగా పబ్లిక్ ఇష్యూతో ప్రజల ముందుకు వస్తున్న ఎస్సార్ ఆయిల్స్ పట్ల ఇన్వెస్ట్‌మెంట్ సంస్థలు, విదేశీ పెట్టుబడి దారులు పెద్ద ఆసక్తి చూపడం లేదు. ఐడిబిఐ ఇష్యూ వాయిదా పడడం వీరికి లాభించినా - ఇదే సమయంలో రిలయన్స్ కంపెనీ 600 కోట్ల ఇష్యూ విడుదల చేయడం ఇబ్బందిగానే వుంది.

- తమ ఇష్యూ మొత్తంలో - డిబెంచర్లు, షేర్లు కూడా - అధిక భాగం రిజర్వేషన్ల ద్వారా కేటాయించాలని కంపెనీ చేసిన ప్రయత్నం ఇంకా ఫలించ లేదు. ఇప్పటి వరకు కేవలం 150 కోట్లు మాత్రమే ఐసిఐసిఐ వంటి సంస్థలు తీసుకున్నాయి. ఎన్ఆర్ఐలు, విదేశీ సంస్థలు పెద్దగా ఆసక్తి చూపడం లేదు.

# అసంపూర్ణ నిషేధం

కొంగులు బిగించి, మద్య మహమ్మారిపై ఆంధ్ర మహిళలు జరిపిన చరిత్రాత్మక పోరాటం అంతిమ విజయం సాధించింది. ఎవరి ప్రేరణ లేకుండా, ఎవరి నాయకత్వం కోసం ఎదురు చూడకుండా, తమ ఇళ్లలో తమ జీవితాలలో చిచ్చు పెడుతున్న సారా మహమ్మారి భరతం పట్టడానికి తమంతట తాముగా కదన రంగంలోకి దూకి, ప్రభుత్వం మెడలు వంచిన మహిళా శక్తి ప్రపంచం నివ్వెరపోయే ఘనతను సాధించు కొన్నది. సాంఘిక ఉద్యమాల చరిత్రలో సువర్ణాక్షర లిఖిత మౌతుంది ఈ విజయం. ముఖ్యమంత్రి ఎన్టి రామారావు తన ఎన్నికల వాగ్దానాన్ని తు.చ తప్పకుండా నెరవేర్చి, చెప్పినట్లే అధికారంలోకి వచ్చిన అరగంట లోపల మద్య నిషేధ ఉత్తర్వును జారీచేసి మహిళల మన్ననలు పొందారు. ఆర్థిక పరమైన లాభ నష్టాలను సరకు చేయకుండా ఒక మహత్తరమైన సామాజిక సంస్కరణకు చేయూతనిచ్చిన ఎన్టిఆర్‌ను అభినందించాలి.

త్రాగుడు దుర్వ్యసనంతో కొన్ని లక్షల కుటుంబాలు నిత్య నరకాన్ని చవి చూస్తున్నాయి. ఆర్థికంగా ఆయా కుటుంబాలు ఛిద్రం కావడమే కాదు - సాంఘికంగా కూడా వారు ఇరుగు పొరుగుల అవహేళనలకు గురౌతున్నారు. వారి కుటుంబాల లోని పిల్లలు సరైన ఆదరణకు నోచుకోక చిన్న వయస్సులోనే నేర ప్రవృత్తిని అలవర్చు కుంటున్నారు. త్రాగుడు అలవాటు పడిన వారినే కాకుండా, వారి కుటుంబపు జీవితాలనే కకావికలు చేస్తున్న మద్య మహమ్మారిని తుదకంటా తెగ నరకడం అవశ్య ఆచరణీయం. ఇందుకోసం ప్రభుత్వం చట్టాన్ని కూడా కఠినతరంగా తయారు చేసింది. అమలు చేసే అధికారులకు విస్తృతాధి కారాలు దఖలు పరచింది. ఇంతవరకు ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించలేము.

కాని, అదే సమయంలో కల్లును మద్య నిషేధం నుంచి మినహాయించడం ; టూరిస్టులు, విదేశీ పర్యాటకులు, పెద్ద వ్యాపార సంస్థల ప్రతినిధులు, మాజీ సైనికులు, ఆరోగ్య రీత్యా త్రాగుడుకు బానిసైనట్లు డాక్టర్ సర్టిఫికెట్ పొందిన వారు పర్మిట్లు పొంది మద్యం సేవించ వచ్చునని చేసిన నిర్ణయం, అసలు నిషేధో ద్యమానికి ఎసరు పెట్టే తీరులో వుంది. గీత పని వారికి ఉపాధి పోతుందనే పుద్దేశ్యంతో కల్లును మినహాయించారు. కాని కల్లు కూడా మత్తు పానీయమే. పైపెచ్చు రాష్ట్రంలో నిజమైన కల్లు కంటే, కల్తీ కల్లే ఎక్కువ వాడకంలో వుంది. అధికంగా మత్తు కల్గించడం కోసం విష పూరితమైన రసాయనాలు కల్పి కల్లును తయారు చేస్తున్నారు. సారా, బ్రాందీలు లేని కరువులో ఈ కల్తీ మరింత జోరుగా జరుగుతుంది. మద్యానికి బానిసైన వాడు, సారా బదులు కల్లుకు అలవాటు పడతాడు. దానివల్ల మద్య నిషేధ లక్ష్యమే దెబ్బ తిని పోతుంది. కల్తీ కల్లు చావులూ సర్వ సాధారణమై పోతాయి.

పర్మిట్ల పద్ధతి వల్ల సంపన్న వర్గాలలో మద్యపానం యధా ప్రకారం జరిగిపోయే ప్రమాదం వుంది. కార్పొరేట్ కంపెనీల సమావేశాలకు మద్యం అనుమతిస్తే - ప్రతి రోజూ ఆ సమావేశాలు జరుగుతూనే వుంటాయి. ఆంధ్రేతరుల పేరుతో త్రీస్టార్, ఫైవ్‌స్టార్ హోటళ్ల ప్రతి గదికి విచ్చల విడిగా మద్యం సరఫరా చేసి లక్షలు కొల్లగొడ్తాయి. డాక్టర్ సర్టిఫికెట్లనేవి అవినీతికి లైసెన్సుగా మారుతాయి. సంపూర్ణ మద్య నిషేధమనే నినాదం ఇచ్చేటప్పుడు, ఇన్ని మార్గాలలో త్రాగుడుకు అనుమతించడం సమర్థనీయం కాదు. అసంపూర్ణ మద్య నిషేధం వల్ల, దొడ్డి దారిలో మద్యం ఏరులై పారుతుంది.

మద్య నిషేధ చట్టంలోని ఈ లొసుగులు ఒక ప్రక్క, అమలు కోసం కట్టబెట్టిన విస్తృతాధి కారాలు ఇంకొక ప్రక్క ఎక్సైజ్ అధి కారులను మరింత అవినీతి పరులుగా మార్చే ప్రమాదం వుంది. సారాయి, మద్యం వ్యాపారుల వద్ద నెల మామూళ్లు దండుకొంటూ బ్రతికే ఎక్సైజ్ అధికారులు, ఇప్పుడదే వ్యాపారులు చేసే అక్రమ అమ్మకాలను నిరోధించ గలరను కోవడం భ్రమ. స్మగ్లింగ్ చేసే వారినుంచి పాత మొగమాటాలతో లంచాలు గుంజుకొని, వారి అక్రమాలను చూసీ చూడనట్లు వదిలేసి; అదే సమయంలో తాము పని చేస్తున్నట్లు లోకాన్ని నమ్మించడానికి అమాయకులను వేధించే నీచానికి ఎక్సైజ్ అధికారులు దిగజారే ప్రమాదం వుంది.

ప్రభుత్వం పునరాలోచన జరిపి కల్లును కూడా నిషేధించడం, పర్మిట్ల పద్ధతిని రద్దు చేయడం అవసరం. నిషేధం అమలు బాధ్యతను ఎక్సైజ్ అధికారుల నుంచి తొలగించి, ఇతర ప్రభుత్వ శాఖల నుంచి నీతిపరులుగా, సత్ప్రవర్తనా పరులుగా రుజువైన వారిని ఏరి, వారందరితో ఒక ప్రత్యేక శాఖను ఏర్పర్చి, అమలు బాధ్యత అప్పచెప్పాలి.

మహిళలు కూడా నిషేధంతో తమ లక్ష్యం నెరవేరిందని ఉపేక్షించకుండా, తమ ఉద్యమాన్ని మరింత ఉధృతం చేయడం అవసరం. వారు నిజంగా మెళకువగా వుండ వలసింది ఇప్పుడే. నిషేధ చట్టం అమలుకు ప్రభుత్వంతో సహకరించి, ఒక మద్యం సీసా కూడా వ్యసన పరులకు దొరకకుండా నిరోధించి నప్పుడే వారి ఉద్యమం నిజంగా చరితార్థ మౌతుంది.

జన్మభూమి రైతు

19-1-1945

పేజీలు 8 వెల : 0-1-6

## పల్లెటూళ్లు

### ఉదయగిరి

వెనకబిక్కి వర్షాలు కురిసినయి. పైరు జొన్నకు అదను మించింది. 30 వేల ఎకరం బీడు.

### చింతారెడ్డిపాళెం

ఈ గ్రామంలో కిరసనాయిల్ గత్తర విషయమై పలువురు ఫిర్యాదు చేస్తున్నారు. మునసబుగారు చక్కజేస్తారనుకుంటా.

### వంజవాక

అది వెంకటగిరి ఎస్టేట్ గ్రామం. ఈ గ్రామ శివాలయపు బావిని బొద్దుకట్టక విడిచినందున మురుగుడు నీరు వీధినుండి బావిలోకిపారి ఆ పావనమైన పానీయం గ్రామస్థులకంతా వినియోగమై కుక్కల, పందికొక్కుల మూడలపాలిటి స్వర్గలోకమై వుంటున్నది. ఈ బావికి బొద్దు కట్టించవలసిం దెవరు? బాధ్యులు తమ బాధ్యతను నిర్వహిస్తారా?

### కోవూరు కలరా

జిల్లాలో ఒక్క కోవూరు తాలూకాలోమాత్రం కొద్దిగా కలరా వున్నది. గత 13 తేదితో అంతమైన వారంలో పడుగుపాడులో ఒకరికి, అన్నారెడ్డిపాళెమున ఇద్దరికి తగిలి 3 గ్గురూ చనిపోయినారు.

### బుచ్చి

అయ్యవారిని పిల్లవారు కొట్టారు. ఉపాధ్యాయుడు కాలుమడుచుకొని వచ్చేలోపల వారు పడుకోనున్న మంచము, దోమతెరతో సహా భోగిమంటలో ఆహుతి జేశారు. ఈ దుండగాలకు జస్టిసువారు గూడా ఏవగించుకొంటున్నారు.

-ఒ.వి.

**50 ఏళ్లక్రితం ఈవారం**

### గండికోట ప్రాజెక్టు

రాపూరు తాలూకాకంతా వర్తింప జేయవలెను

గత 5-1-45 తేదిన తాలూకా రైతు మహాసభ రాపూరులో సమావేశమైనది. 200 మంది రైతులొచ్చిరి. వకీలు మొగుళ్లూరు శివయ్య గారధ్యక్షత వహించిరి. అధ్యక్షులు, బొల్లు చెం.న.శెట్టి కలిమలి వెంకట్రమణయ్యగారలు మాట్లాడుతూ గండికోట ప్రాజెక్టులో రాపూరు తాలూకా భూములన్నియు చేర్చక ఉత్తరపు యెల్లమీద కొన్ని భూములు మాత్రం చేర్చుట విచారకరమనియు,ఈ తాలూకాలో సారవంతమైన భూములుండియు.

కొరవ 8 పేజీలో

# హేతు బద్ధమైన పన్నులు- ప్రజల పై భారం వేయవద్దు!

ఇటు ప్రజలపై భారం పడకుండా, అటు వర్తకులను వేధించకుండా ఒక హేతు బద్ధమైన పన్నుల విధానాన్ని ప్రవేశపెట్ట గలమని రాష్ట్ర వాణిజ్య శాఖ మంత్రి చెప్పారు. అయితే వాల్యుయేడెడ్ ట్యాక్స్ విధానంపై వాణిజ్య పన్నుల శాఖాధికారులకే పూర్తి అవగాహన లేదని, కాబట్టి దాన్ని అమలు చేయరాదని వర్తకులు చెబుతున్నారు. అంతే కాకుండా అధికారుల్లో అవినీతిని అరికడితే అయిదు వేల కోట్ల రూపాయలకు పైగా ఏటా ప్రభుత్వానికి రెవిన్యూ వస్తుందని వర్తకులు వివరిస్తున్నారు. 5 లక్షల రూపాయల వరకు టర్నోవర్ వున్న వారిని అన్ని ట్యాక్స్‌ల నుండి మినహాయించాలని, సంవత్సరానికి 5 లక్షల నుండి 15 లక్షల టర్నోవర్ వున్నవరకు సెల్ఫ్ అసెస్‌మెంట్ విధానానికి అవకాశ మివ్వాలంటున్నారు. ఆదాయ పన్ను రిటర్న్ దాఖలు చేసిన విధంగా రిటర్న్ దాఖలు చేస్తారని, సింగిల్ పాయింట్ పన్ను విధానమే శ్రేయస్కరమని వ్యాపారస్తులు కోరుతున్నారు. అలాంటప్పుడు వర్తక, వాణిజ్య వర్గాలను సమావేశ పరచి వారి సూచనలను పరిశీలించి ఒక నిర్ణయానికి వస్తే మంచిది; ప్రజలపై ఏ విధమైన భారం మోపకుండా చూడాలి.

నెల్లూరు - కె.బాలకొండయ్య

### దిగజారిన రాజకీయాలు

రాజకీయ రంగం కలుషితమై పోయిందని ప్రతి ఒక్కరూ గొంతు చించు కొంటున్నారు. రాజ నీతిజ్ఞుడు జాన్‌లాక్ - అయోగ్యులకు రాజకీయాలు ఆఖరి ఆశ్రయమని చాలా కాలం క్రితమే చెప్పి వున్నాడు. చివరకు సినిమా నటులు ప్రజా నాయకులుగా కొనియాడబడే రోజులొచ్చాయి. కమ్యూనిస్టు నాయకుడు హిరేన్ ముఖర్జీ - మాజీ రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆంధ్ర విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులుగా వున్నపుడు అక్కడ ప్రొఫెసర్‌గా పనిచేశారు. పార్లమెంటు ఉభయ సభల్లో వుత్తేజితంగా పాల్గొంటుంటే వారు. వయస్సు మళ్లినా ఇప్పటికీ పత్రికలకు వ్యాసాలు వ్రాస్తున్నారు. ఆయన కొత్తగా రాజకీయాల్లోకి వచ్చి ప్రజాసేవ చేస్తామన్న వాళ్లకు "మౌంటి బాంక్" అని పేరు పెట్టారు. వీధుల్లో బల్లల మీద రంగు సీసాలు పెట్టి మాయ మాటలతో, చతురోక్తులతో నకిలీ మందులను అమాయకులకు అంటగట్టే వాళ్లకు ఇంగ్లిషులో ఆ పదాన్ని వాడుతారు.

కొరవ 6 పేజీలో

**జనవాణి**

## నెల్లూరు సంగతులు

### నెల్లూరులో ఉద్యోగం సుఖం

#### ఎస్పీ ఆత్మవిశ్వాసం

పోలీస్ సూపరింటెండెంట్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన బి. పూర్ణచంద్రరావు 16తేది తొలిసారిగా పత్రికల వారితో మాట్లాడారు. మాత్సారుపేటలో ఇంతకు మునుపు రేంజర్‌గా పనిచేసిన అనుభవంతో కాబోలు ఎస్పీ ఒక మాటన్నారు. నెల్లూరు జిల్లా చాలా ప్రశాంతమైన జిల్లా; ఇతర జిల్లాల వలె ఇక్కడ సమస్యలు అధికంగా వుండవన్నారాయన. జిల్లా కొచ్చే ప్రతి కొత్త అధికారీ జిల్లాలో పని చేయడం కత్తి మీద సామంటారు. మరి ఇంత ధైర్యంగా ఎస్పీ గారు చెబుతున్నారు కాబట్టి ఆయన ఆత్మవిశ్వాసాన్ని అభినందించక తప్పదు. టౌన్‌లోని ఆరు పోలీస్ స్టేషన్లలోని సిబ్బంది ఎన్నో సంవత్సరాలుగా బదలీ లేని విషయం పై దృష్టి సారించి తగిన చర్యలు తీసుకొంటానన్నారాయన. టౌన్‌లో వారంరోజుల్లో ఏర్పాటు చేయబోయే మహిళా పోలీస్ స్టేషన్‌లో ఒక మహిళా ఎస్ఐతో పాటు ఇద్దరు హెడ్ కానిస్టేబుళ్ళు, 10 మంది కానిస్టేబుళ్లు వుంటారని చెప్పారు. వరకట్న వేధింపులు, కళాశాల విద్యార్థినులపై ఆకతాయి వేధింపులతోపాటు మహిళల సమస్యల పరిష్కారానికి ఈ స్టేషన్ కృషిచేస్తుందన్నారు. ప్రతి సోమవారం ప్రజా విజ్ఞప్తుల దినాన్ని తన కార్యాలయంలో నిర్వహిస్తాననీ; స్టేషన్లలో న్యాయం జరగనివారు, శాంతి భద్రతల సమస్యల్ని అర్జీల ద్వారా తెలియజేయవచ్చని చెప్పారు. సింగిల్ నంబర్ లాటరీలు, వ్యభిచారాన్ని రూపుమాపడంతోపాటు జిల్లాలో పెరిగిన దొంగతనాలను అదుపు చేసేందుకు ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేయనున్నట్లు వివరించారు.

### త్రాగితే జైలుపాలే!

#### కలెక్టర్ హెచ్చరిక

17తేది నుంచి మద్యనిషేధం అమలులోకి వచ్చినందున మత్తు పానీయాలు కొనుగోలు చేసినా, తాగినా నేరమని ఇన్‌ఛార్జ్ కలెక్టర్ తన ఛాంబర్‌లో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో చెప్పారు. ఇకనుండి మద్యం సేవించిన వారు వేయిరూపాయల జరిమానా, 6నెలల జైలుశిక్ష అనుభవించాల్సి వస్తుందని హెచ్చరించారాయన. కల్లు మినహా మిగిలిన మత్తు పానీయాలను ఎవరైనా విక్రయిస్తే ఏడాది జైలుశిక్ష, 5 వేల రూపాయలు జరిమానా తప్పదన్నారు. మద్యం సీసాల్ని ఇళ్ళ, హోటాల్లో ఎవరైనా వుంచుకొంటే వేయి రూపాయల జరిమానా, ఆరు నెలల

కొరవ 8 పేజీలో

### ఏసివేయకుంటే నాకు చెప్పండి!

#### జెసి వార్నింగ్

టౌన్‌లోని మెజార్టీ ఏ.సి. థియేటర్లలో సినిమా నడిచే సమయంలో ఏ.సి.తో పాటు ఫ్యాన్లు వేయక ప్రేక్షకులకు ప్రత్యక్ష నరకం ఏవిధంగా వుంటుందో చవి చూపిస్తున్నారు థియేటర్ యజమానులు. ఈ విషయాన్ని అధికారుల దృష్టికి తీసుకువెళ్ళినా ఇంతకాలం పట్టించుకోలేదు. ఇటీవల కొందరు ఇన్‌ఛార్జి కలెక్టర్ సతీష్‌చంద్రకు ఈ విషయమై ఫిర్యాదు చేయగానే ఆయన స్పందించారు. సినిమా థియేటర్లలో సినిమా ప్రదర్శిస్తున్న సమయంలో ఉష్ణోగ్రత 76 డిగ్రీల ఫారన్‌హీట్ నుంచి 80 డిగ్రీల వరకు వుండే విధంగా చూడాలని ఆదేశించారాయన. ఆ విధంగా చేయకుంటే కఠిన చర్యలు తప్పవంటున్నారు. ఏ.సి.ని వుపయోగించ కుండానే ఏ.సి. రేట్లను వసూలు చేయడం తీవ్రంగా పరిగణిస్తున్నట్లు చెప్పారు. ఇక సినిమాలకు వెళ్లిన వారు ఏ.సి. వేయని పక్షంలో వెంటనే కలెక్టర్‌కు ఫోనుచేస్తే సరిపోతుందేమో!

## సణుగుడు

### * పోలీసులకు లాఠీలుంటేనే పట్టలేము- కోరలు మొలిపిస్తే తట్టుకునేదెట్లా?

మద్యపాన నిషేధాన్ని సక్రమంగా అమలు చేయాలన్న అత్యుత్సాహంలో ప్రభుత్వం పోలీసుకు విచక్షణా రహితంగా అధికారాలు కట్ట బెడుతున్న తీరు చూస్తుంటే భయ మేస్తున్నది. మద్య నిషేధం అమలు పరచాల్సిందే; అందులో రెండో అభిప్రాయానికి తావు లేదు. ప్రభుత్వం దీన్ని తమ రాజకీయ ప్రతిష్టగా భావిస్తున్నది కాబట్టి కఠినంగా వ్యవహరించడమూ అర్థం చేసుకోదగిన సంగతే. కాని, కేవలం పోలీసు జులుంతో, అధికార దండ ప్రయోగంతో త్రాగుడు మాన్పించాలనే తప్పుడు అభిప్రాయంతో ప్రభుత్వం పోలీసుకు అధికారాలు కట్ట బెడుతున్న తీరు మాత్రం ప్రమాద కరమైనది, భయానకమైనది.

త్రాగాడనే అనుమానం వస్తే దారిన పోయే వాడిని కూడా నిలవేసి, అరెస్టు చేయవచ్చు; త్రాగుతున్నారని తెలిస్తే, పోలీసులు కనీసం సెర్చ్ వారెంట్ కూడా లేకుండా ఏ ఇంటిలో కైనా దూరి వెతకవచ్చు; లోపలున్న వారిని పట్టుకొని బొక్కలో తోయవచ్చు. త్రాగుడు నేరంపై అరెస్టయితే ప్రభుత్వోద్యోగి వెంటనే సస్పెండ్ అవుతాడు. చెక్‌పోస్టుల లోనే కాకుండా, దారిన వెళ్లే ఏ కారు లేదా ఇతర వాహనాన్నయినా పోలీసులు నిలిపి, సోదా చేయవచ్చు. అక్రమ మద్యం కలిగివున్న వారిని ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం క్రింద బెయిల్ కూడా లేకుండా సెంట్రల్ జైలుకు పంపవచ్చు.

చెప్పుకుంటూ పోతే ఇటువంటి స్వేచ్ఛాయుత అధికారాలు చాలా వాటినే పోలీసుకు కట్టబెట్టింది ప్రభుత్వం. ఎమర్జెన్సీ సమయంలో కూడాపోలీసులకు ఇంత విస్తృతమైన అధికారాలు లేవు. పట్టి లాఠీ చేతిలో వుంటేనే వీర విహారం చేసి, అమాయకులను వేధించే మన పోలీసుకు - కోరలు తగిలించి, వాటికి పదును పెట్టి, విషం పూసి వీధుల్లోకి వదిలితే ఎటువంటి వికృత ఫలితాలు ఎదురౌతాయో వూహించ డానికే భయమేస్తున్నది.

**డోలేంద్ర**

కానిస్టేబుళ్ల నుంచి ఇన్స్పెక్టర్ల వరకు, ఆ పై స్థాయి అధికారులు కూడా తమకు గిట్టని వారిని త్రాగుడు పేరుతో పట్టి, పీడించేందుకు మార్గ మేర్పడుతున్నది. దీనివల్ల, పౌరుల వ్యక్తిగత జీవితాలలో అనవసర జోక్యం చేసుకొనేందుకు ఆస్కారం కల్గుతున్నది; దారిన పోయే వాడినల్లా నిల్పి, బెదరించి, డబ్బు పిండే అవినీతికి పోలీసుకు లైసెన్సు ఇచ్చి నట్లవుతున్నది.

కేవలం గూండాలకే పరిమితమైన పి.డి. చట్టాన్ని పోలీసులు ఎంత దుర్వినియోగం చేసింది మనం చూశాం. వారంటు సైతం అవసరం లేకుండా ఇళ్లలో దూరి గలభా

కొరవ 6 పేజీలో

# 4 వేల ఏళ్ళ నాడే దువ్వూరులో జన నివాసం!

## నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!

కొల్లూరి సాయిభక్త కేశవ
సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

(గత సంచిక తరువాయి)

నెల్లూరు జిల్లాలో క్రీ.పూ. 2000 సంవత్సరాలనాడు మానవ నివాసాలున్నాయని చెప్పడానికి ఇవి దోహదం చేస్తున్నాయి. అయితే క్రీ.పూ. 5,000 సంవత్సరాల నుండి 2000 సంవత్సరాల మధ్య నెల్లూరు జిల్లాలో మానవునికి చెందిన అవశేషాలు ఇంకా లభ్యం కావలసివుంది.

### బృహత్ శిలా యుగము

ఈ యుగం మానవ చరిత్రలో చాలా ముఖ్యమైనది. నేటి [illegible] కట్టుబొట్లు, ఎముకల సమూనాలు ఈ కాలంలోనే రూపుదిద్దు కున్నాయి. మానవుడు చెరువులు త్రవ్వి, నదులకు ఆనకట్టలు వేసి కాలువల ద్వారా వ్యవసాయం చేయడం ఈ కాలంలోనే మొదలైనది. జంతువులను మచ్చిక చేసి పెద్ద మందలుగా పెంచడం, పెద్ద గ్రామాలు ఏర్పాటు చేయడం జరిగింది. మానవుడు ఇనుప పనిముట్లు ఎప్పుడు తయారు చేశాడో ఖచ్చితంగా తెలియక పోయినా, ఈ కాలంలోనే గొడ్డళ్ళు, కత్తులు, గడ్డపారలు, త్రిశూలాలు, కొడవళ్ళు, దీప స్తంభాలు, ముక్కాలి పీటలు ఎక్కువగా తయారు చేశాడు. ఇనుము వాడకం ఈ కాలంలో చాలా ఎక్కువగా జరగడం వల్ల ఈ యుగాన్ని ఇనుప యుగం అని కూడా అంటారు.

ఇంత అభివృద్ధి చెందిన నాగరికతా వికాసపు లక్షణాలున్నా ఈ యుగానికి సంబంధించిన కొన్ని చిక్కుముడులు విడిపడం లేదు. అందులో ముఖ్యమైనది ఈ కాలంనాటి సమాధులు; పెద్ద పెద్ద బండలను గుండ్రంగా పేర్చి, మధ్యలో గొయ్యి త్రవ్వి శవానికి సంబంధించిన అస్థికలుంచడం ఈ కాలపు ఆచారం. ఈ సమాధులు రకరకాలుగా ఉండడం అందులో దాదాపు చాలా కుండలు వరుసగా పేర్చి వుంచడం, శవానికి సంబంధించిన అస్థిపంజరం పూర్తిగా లేకుండా ఏవో కొన్ని ఎముకలు మాత్రమే ఉండడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఒక శతాబ్ది కాలంగా ఈ విషయంలో పరిశోధనలు జరుగుతున్నప్పటికీ చిక్కుముడులు విడవడక శాస్త్రజ్ఞుల దృష్టిని ఆకర్షిస్తూనే వున్నాయి. బృహత్ శిలాయుగపు నిర్మాణ కర్తలు ఎవరు? ఏ తెగకు చెందిన వారు, ఏ నాగరికతా సమాజంలోనూ ఇంత పెద్దవి, వైవిధ్యం వల్ల సమాధులు కనిపించక పోయినా వీరు ఎందుకు సమాధులకు అంత ప్రాధాన్యత ఇచ్చారు. అసలు ఈ యుగం ఎప్పటి నుండి ప్రారంభమయ్యింది అనే విషయాలపై పురావస్తు శాస్త్రవేత్తలు నిరంతరం పరిశోధనలు జరుపుతూనే వున్నారు.

బృహత్ శిలాయుగం అంటే పెద్ద పెద్ద రాతి పలకలతో నిర్మితమైన సమాధులున్న కాలమని చెప్పవచ్చు. ఆ కాలపు వాసులు - చనిపోయిన తమ బంధు మిత్రుల కొరకు పెద్ద పెద్ద బండలు సమాధులుగా తయారు చేశారు. ఇవి చాలా రకాలుగా వున్నాయి. 1. పిట్ బరియల్: బండలు గుండ్రంగా పేర్చి మధ్యలో గొయ్యి త్రవ్వి శవ అస్థికలుంచడం. 2. సిస్ట్ బరియల్: బండలు గుండ్రంగా పేర్చి మధ్యలో గొయ్యి త్రవ్వి, అక్కడ రాతి పలకలతో ఒక శవపేటికను తయారుచేసి అందులో అస్థికలుంచడం. ఉదాహరణకు ఉచ్చూరు, ఆది రాఘవపురం గ్రామాలు. 3. రాక్‌కట్ చాంబర్ టూంబ్స్: బొంతరాతిని ఒక బల్బు ఆకారంలో కాని, జార్ ఆకారంలో కాని సుమారు 1 1/2 నుండి 2.00 మీటర్ల లోతులో త్రవ్వి అందులో అస్థికలుంచడం. ఉదాహరణకు కొన్నవాడ. 4. డోల్మెనాయిడ్ సిస్ట్స్: పెద్ద పెద్ద శిలా ఫలకాలు భూమి పైభాగంలో గదులుగా నిర్మించి అందులో మానవ అస్థికలుంచడం. ఇవి దాదాపు ఆరు అడుగుల పొడవు, ఎత్తు కలిగి వుంటాయి. వీటిలో ఒక రాతికి మనిషి దూరేటంత రంధ్రముంటుంది. సమాధి నిర్మాణం పూర్తి అయిన తర్వాత మనిషి అస్థికలను తీసుకెళ్ళి లోపల స్థాపితం చేస్తారు. అంతేకాక ఈ సమాధిని ఆ కుటుంబంలో చనిపోయిన ఇతరుల శకలాలు వుంచడానికి కూడా ఉపయోగిస్తారు.

ఇంకా అనేక రకాలైన సమాధులున్నప్పటికీ, మనకు నెల్లూరులో ప్రధానంగా కనిపించేవి పై తెల్పిన సమాధులు మాత్రమే. ఇవి నెల్లూరు జిల్లాలో నలుమూలల వ్యాపించి వున్నప్పటికీ భారతదేశ బృహత్ శిలాయుగపు సమాధులున్న పటంలో నెల్లూరు జిల్లాను పేర్కొనలేదు. దీనికి కారణం అప్పట్లో వీటికి చెందిన సమాచారం వారికి అందించక పోవడమే.

ఈ సమాధులకు సంబంధించి

కొరవ 10 పేజీలో

## నెల్లూరు నలుచెరగుల్లా
### విహార్మకుడు

### రైతులు నిలువునా మునిగిపోయారు!

రైతాంగం పైన ప్రకృతి తనకున్న పగను వర్రైటీగా తీర్చుకొంటున్నది. తడి గుడ్డతో గొంతు కోసినట్లు శబ్దం లేకుండా రైతు కొంపను ఆర్పేస్తున్నది. తుఫాన్ లేదు, కరువు రాలేదు, వెల్లువెత్తి వాన లేదు, దారి కన్పడని పొగ మంచు లేదు. కానీ వీటన్నిటి దుష్ప్రభావాలు కలగలసిన ప్రకృతి వికృత ప్రభావాలు మాత్రం పుష్కలంగా కన్పిస్తున్నాయి. విడవకుండా ఆగిఆగి కురుస్తున్న వానకు పంటలు, పైర్లు తీన్నారై పోతున్నాయి. వాతావరణం వ్యవసాయానికి పూర్తిగా ప్రతికూలంగా వుంది. అధికారుల లెక్క ప్రకారం జిల్లాలో సగటు వర్షపాతాని కంటే ఈ సీజన్‌లో కురిసిన వాన తక్కువగా వుంది. కాని నష్టం మాత్రం అపారంగా వుంది.

వరి పైరుకు వూహించ రానంత నష్టం. డిసెంబరు ఆఖరు, జనవరిలలో వేసిన నార్లు పాచిపోయాయి. ఇప్పటికి రెండుసార్లు నార్లు పోశారు చాలామంది రైతులు. మూడవసారి నారు పోయడానికి విత్తనం దొరకడం లేదు. కోతకు వచ్చిన పైర్లు దెబ్బ తిన్నాయి. చాలాచోట్ల పచ్చ గింజ పడింది. మెకానికల్ హార్‌వెస్టర్లు వచ్చాయి కాబట్టి రైతులు బురద కయ్యల్లోని పైరును బయట పడవేసుకో గల్గుతున్నారు కాని లేకుంటే పంట మునిగిపోయి, ఇంకా నష్టపోయి వుండేవారు.

పొగాకు, వేరుశెనగ పైర్లు కూడా పాచిపోయాయి. మిరప పూర్తిగా దెబ్బ తిన్నది. మినుము, పెసర నీటిలో నానిపోయాయి. మామిడి తోటల్లో పూత రాల్తోంది. కాపు బాగా వుంటుందన్న గ్యారంటీ లేదు. మొత్తమ్మీద అన్ని రకాలుగా దెబ్బ తినిపోయాడు రైతు. ప్రకృతి మూగ దెబ్బకొట్టింది. తుఫానో, వరదో వచ్చివుంటే తెలిసిన నష్టం. ఇది ఎటూకాని పరిస్థితి.

జిల్లా ఆర్థిక వ్యవస్థను ఆకాశానికి ఎత్తగల దనుకున్న రొయ్యల పెంపకం కూడా ఈసారి రైతు కొంప గుల్ల చేసింది. అధిక దిగుబడి దురాశతో, విదేశీ మేతల వ్యామోహంలో పడి తమ భవిష్యత్‌ను తామే చేజేతులా నాశనం చేసుకొన్నారు రైతులు. మేతల తోపాటు థాయిలాండ్ నుంచి దిగుమతైన మూడు రకాల వైరస్ వ్యాధులు రొయ్యల పెంపకం పరిశ్రమను సమూలంగా తుడిచి పెట్టేశాయి. నష్టం ఎన్ని కోట్లు వుంటుందో వూహకందని విషయం. చిన్న రైతులు, పెద్ద కంపెనీలు కోలుకోలేని నష్టాల వూబిలో కూరుక పోయాయి.

ఇన్ని రూపాలలో రైతాంగం దెబ్బ తినడం దురదృష్టకరం. ప్రకృతి ప్రకోపం తరచు రైతు బ్రతుకును చితికి పోయేట్లు చేస్తున్నా, చూస్తూ వూరుకోవడం, మౌనంగా కుమిలి పోవడం తప్ప ఏమీ చేయలేక పోతున్నాడు రైతు.

### జాయింట్ కలెక్టర్ కర్నూలుకు బదలీ

నెల్లూరు జిల్లా జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర అదే పదవిలో కర్నూలుకు బదలీ అయ్యారు. ఆయన స్థానంలో శ్రీ ఎం.ఆర్. నాయక్ నెల్లూరు వస్తున్నారు.

సతీష్ చంద్ర గారికి నెల్లూరు జిల్లాతో అవినాభావ సంబంధం. ఐఎఎస్ శిక్షణ తర్వాత, గూడూరు సబ్ కలెక్టర్‌గా తొలి పోస్టింగ్ ఇక్కడే వచ్చింది. అప్పటినుంచి ఆయన డిఆర్‌డిఎ ప్రాజెక్ట్ డైరెక్టర్‌గా, డిడిఒగా, ఎస్సి కార్పొరేషన్ ఇడిగా, సివిల్ సప్లైస్ అధికారిగా, జాయింట్ కలెక్టర్‌గా, ఇన్‌ఛార్జి కలెక్టర్‌గా పలు హోదాలలో పని చేశారు. నెల్లూరుతో ఆయన అనుబంధం ఆరు సంవత్సరాలా నాలుగు నెలలు. ఇంత సుదీర్ఘ కాలం నెల్లూరులో పని చేసిన ఐఎఎస్ అధికారి మరెవ్వరూ లేరు.

సతీష్ చంద్ర గారు నిప్పువంటి నిజాయతీ పరుడు. విధి నిర్వహణలో ఎంతటి వాడినీ లెక్క చేసేవారు కాదు. ఇందువల్ల తరచు తన సిబ్బందితో, అధికారులతో పేచీలు వచ్చేవి. రాజకీయ వాదులు ఆయన వద్దకు సిఫార్సుల కోసం వెళ్లడానికి జంకేవారు. నిజాయితీ, నిర్భీతి, నిరుపమాన సేవాభావం కల్గిన వ్యక్తి అయివుండి కూడా ఇంత సుదీర్ఘ కాలం జిల్లాలో పనిచేయ గల్గడం సతీష్ చంద్ర గారికే చెల్లింది. ఆయనకు మా హార్దిక వీడ్కోలు.

### చక్కెర ఫ్యాక్టరీకి కొత్త ఛైర్మన్

కోవూరు చక్కెర ఫ్యాక్టరీకి కొత్త ఛైర్మన్‌గా ఇనమడుగు ముఖ్య రైతు శ్రీ గండవరపు రాధాకృష్ణా రెడ్డిని నియమించారు. మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి స్వయంగా చేసిన ఎంపిక ఇది. రాధాకృష్ణా రెడ్డి నల్లపరెడ్డి కుటుంబానికి నమ్మిన బంటు. ఆయన ఇదివరకు ఇనమడుగు సర్పంచ్‌గా, రూరల్ బ్యాంక్ అధ్యక్షుడుగా కూడా పనిచేశారు.

చక్కెర ఫ్యాక్టరీని నష్టాల వూబినుంచి బయటకు లాగి, లాభాల గనిగా మార్చి వెళ్లారు శ్రీ సామంతు సుబ్బారెడ్డి. ఆయన పడిన కష్టం వృధా పోకుండా ఫ్యాక్టరీని రాధాకృష్ణా రెడ్డి నిలబెడతారని ఆశిద్దాం!

### లాయర్ ఎడిటర్ రాజగోపాలరెడ్డి మృతి

నెల్లూరులో ప్రముఖ వారపత్రిక 'లాయర్' వ్యవస్థాపక సంపాదకుడు శ్రీ తుంగా రాజగోపాల రెడ్డి 18 తేది రాత్రి కన్నుమూశారు. ఆయన వయస్సు 64 సంవత్సరాలు.

రాజగోపాల రెడ్డి పెద్దపుత్రుడు సర్పంచ్‌గా రాజకీయాలలోకి ప్రవేశించాడు కానీ రాజకీయాలలో ఎక్కువ కాలం నిలువలేక పోయారు. సినిమా రంగానికి వెళ్ళి, జన్మహక్కు అనే చిత్రం తీశారు. అది విడుదలకు నోచుకోలేదు. హోటళ్ల వ్యాపారం మొదలు పెట్టారు. అదీ కలిసి రాలేదు.



'యూత్ కాంగ్రెస్' పత్రికతో సాన్నిహిత్యం పత్రికా రంగం వైపుకు మరలించింది. కొంతకాలం నా సీమ అనే పత్రిక నిర్వహించారు. తర్వాత 'లాయర్' ప్రారంభించి, మరణాంతం

కొరవ 6 పేజీలో

### పాతశత్రువులు

మొదటపేజీ కొరవ

సినిమా పరిశ్రమ వారు తనకు జరిపిన సన్మాన సభలో వున్నట్లుండి ఎన్‌టిఆర్ అక్కినేని పేరు ప్రస్తావించి, ఆయన ఈ సభలో లేకపోవడం తనకెంతో కొరతగా వుందని, తన వల్ల ఎవైనా తప్పులుంటే క్షమించాలని చెప్పి అందర్నీ ఆశ్చర్య పరిచారు. ఈ క్షమాపణ ప్రకటన సైతం అక్కినేనిని కరిగించలేదు. ఆ సమయంలో తల కోనలో షూటింగ్‌లో వుండిన ఆయన ఎన్‌టిఆర్ ప్రకటనకు వ్యంగ్యంగా ప్రతిస్పందించారు.

ఈ దశలో శ్రీమతి లక్ష్మిపార్వతి జోక్యం చేసుకొని నాగేశ్వర రావు గారితో సంభాషించారు. పాత శత్రుత్వం మర్చిపోయి కలిసి పోదామని ఆమె ఆయన్ను వప్పించారు. అక్కినేని కూడా తగు రీతిలో స్పందించడంతో ఇద్దరి మధ్య రాజీ కుదిరి పోయింది. నాగేశ్వర రావు స్వయంగా వచ్చి రామారావు గారికి శుభాకాంక్షలు తెల్పి వెళ్లారు.

కృష్ణ విషయంలోనూ ఇదే జరిగింది. రాజీవ్ గాంధీ ప్రోద్బలంతో రాజకీయాలలోకి ప్రత్యక్షంగా ప్రవేశించిన ఎన్‌టిఆర్‌ను పలు మార్లు నిశితంగా విమర్శించారు. ఆయన రాజకీయ వైఖరి, వ్యక్తిగత జీవితాన్ని తూర్పార పడుతూ సినిమాలు కూడా నిర్మించారు.

లక్ష్మిపార్వతి జోక్యంతో ఆ పాత తగువులన్నీ పరిష్కారమై పోయాయి. ఈ నెలలో నాలుగు సార్లు ఎన్‌టిఆర్‌ను కలిశారు కృష్ణ.

### నడుపుతున్నదెవరు?

మొదటపేజీ కొరవ

నడిపిస్తే ఏ ప్రమాదం ముంచుకొస్తుందో నని వారు హడలి చస్తున్నారు.

శ్రీమతి లక్ష్మిపార్వతి ఈ వారంలో విశాఖ పట్టణం పర్యటనకు వెళ్తున్నారు. అక్కడామెను రాజ లాంఛనాలతో స్వాగతించడానికి సకల ఏర్పాట్లు జరిగి పోతున్నాయి. ఆర్థిక మంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు లండన్ పర్యటనకు వెళ్లి వున్నారు. నగరంలో వున్నది వెంకటేశ్వర రావు ఒక్కరే!

### కోట్ల

మొదటపేజీ కొరవ

రావడం చాలా సంకటమైన విషయం. తెలుగుదేశం ఎమ్మెల్యేలు చేసే విమర్శలు, ఎగతాళి వ్యాఖ్యలను భరించాలి. ఏ తప్పు ఎత్తి చూపినా, నిన్నటి వరకు తమరు చేసిందేమిటన్న హేళన ఎదురౌతుంది. అంతటి అవమానాలను సహించడానికి కూడా విజయభాస్కర రెడ్డి సిద్ధపడ్డారంటే, ఆయనలోని అధికార దాహం ఎంత తీవ్రంగా ముదిరి పోయి వుందో అర్థం చేసుకోవచ్చు.

ఇదిట్లా వుంటే, సిఎల్‌పి నాయకుడికి క్యాబినెట్‌లో హోదా కల్పించే విషయంలో ముఖ్యమంత్రికి, మాజీ ముఖ్యమంత్రికి మధ్య ఒక అవగాహన కుదిరిందని వదంతి. తాను ముఖ్యమంత్రిగా వున్నప్పుడు రామారావు గారిపట్ల ఉదారంగా ప్రవర్తించిన తీరు లోనే, ఇప్పుడాయన తన పట్ల ఉదారంగా ప్రవర్తిస్తారని విజయ భాస్కర రెడ్డి ఆశిస్తున్నారు. క్యాబినెట్ హోదా తప్పకుండా వస్తుందని ఆశపడుతున్నారు.

## సణుగుడు

4 వ పేజీ కొరవ

వ్యక్తిపై అధికారం పోలీసుకు ఇస్తే ఎంతటి అరాచకం ప్రబలి పోతుంది. రాజకీయ ప్రోద్బలంతోనో, వ్యక్తిగత కక్షతోనో పోలీసులు అమాయక పౌరుల ఇళ్ళలోకి, రాజకీయ శత్రువుల లోగిళ్ళలోకి ప్రవేశించి, హింసించరని నమ్మకం ఏముంది? పోలీసులే రెండు సీసాలు చేత పట్టుకొని వెళ్లి, అవి ఇళ్ళలో దొరికాయని అక్రమ కేసులు బనాయించరని గ్యారంటీ ఏమిటి? కోపం వున్న ప్రభుత్వ ఉద్యోగులపై త్రాగుడు నేర మారోపించి, ఉద్యోగాలకు ఎసరు పెడితే ఏమి కావాలి?

ప్రైవేటు కార్లను చెక్‌పోస్టు దగ్గర నిలిపి, సూట్ కేసులు తెరచి సోదా చేస్తున్నారు. వ్యాపార అవసరంతో డబ్బునో, లేక పెండ్లిండ్ల వంటి సందర్భాలలో నగలు నట్రానో తీసుకవెళ్ళే వారు అందరి ఎదుటా వాటిని బహిరంగంగా ప్రదర్శించ వలసి వస్తున్నది. గుంపుగా చేరిన జనం మధ్య నగలు, నగదు ప్రదర్శిస్తే - ఆ గుంపులో బందిపోట్లు, కిరాతక దొంగలు వుండరని నమ్మకం ఏమిటి? వారి కళ్ళల్లో పడితే ఆ వాహనాలలో వారు క్షేమంగా ఇళ్లకు తిరిగి రాగలరా? దారిలో వారికి ఎవరు రక్షణ కల్పిస్తారు?

సాధారణ పోలీసులు, ఎక్సైజ్ సిబ్బంది ఎక్కడ బడితే అక్కడ కార్లు, బస్సులు నిలిపి తనిఖీలు చేయడమంటే పౌరుల ప్రైవేటు జీవితం ఎంత చికాకుకు లోనౌతుంది? కార్లలోని ఆడవారికి రక్షణ ఏమిటి? ఎవరు కాపాడతారు వారిని ?

ప్రమాదకరమైన, అరాచక ప్రాయమైన పరిస్థితులకు ఆస్కారం కల్పిస్తున్నది మద్య నిషేధ చట్టం. త్రాగేవారిని అదుపు చేయాలన్న వుద్దేశ్యంతో, త్రాగుడు అలవాటు లేని సాధారణ పౌరులనూ చిక్కులు, చికాకులకు గురిచేయ బోతున్నది ప్రభుత్వం. త్రాగుడు అనే దుర్వ్యసనాన్ని రూపు మాపడం ఉదాత్తమైన లక్ష్యమే. కాని ఆ పేరుతో ఆ వ్యసనంతో నిమిత్తం లేని నగటు పౌరుణ్ని ఎందుకు బాధించాలి! అందర్నీ ఒకే గాటన కట్టేసి ఎందుకు చూడాలి? ప్రైవేటు వాహనాలను, ప్రైవేటు ఇళ్లను పోలీసులకు అప్పచెబితే ఎక్కడకు దారి తీస్తుంది ఆ పరిస్థితి? కేవలం పోలీసు జులుంతో త్రాగుడు వ్యసనం మాన్పగలరా? విస్కీ, బ్రాందీల స్మగ్లింగ్ ఆపడం మన పోలీసు తరమా? మద్య నిషేధం పెట్టిన ఏ రాష్ట్రం లోనైనా అది విఫలైందా ? ఎర్ర చందనం, బియ్యం, కలప, ఆయుధాలు, బంగారు వంటి వస్తువుల స్మగ్లింగ్‌ను ఎంతవరకు నిరోధించ గల్గుతున్నాం మనం? సరిహద్దులలోని భారత సైన్యానికే స్మగ్లింగ్‌ను నిలపడం సాధ్యం కావడం లేదే - అవినీతి, రాజకీయ దుర్నీతులతో కుళ్లి పోయిన పోలీసు వ్యవస్థకు అంత సమర్థత వుందా? కేవలం ఒక పార్టీ ఎన్నికల నినాదం కోసం, ఒక ప్రభుత్వ రాజకీయ ప్రతిష్ట కోసం పౌరుల వ్యక్తిగత జీవితాలను పోలీసుల చేతిలో పెట్టి, రాచిరంపాన పెట్టడం అన్యాయం, అక్రమం, దుర్మార్గం. ప్రాథమిక పౌర హక్కులకు తీవ్రమైన హాని చేసే చట్టంగా మద్య నిషేధాన్ని తయారు చేసి, సరిదిద్దు కోలేని పొరపాటు చేస్తున్నది ప్రభుత్వం.

మద్య నిషేధం అమలు కావాలంటే ప్రజలలో చైతన్యం ప్రేరేపించాలి. విస్తృత ప్రచారం కల్పించాలి. సాంఘిక ఉద్యమాలు నిర్వహించాలి. పౌరులలో, ముఖ్యంగా మహిళలలో, జాగృతి తెచ్చి ఇంటింటా సంస్కరణలకు బీజం వేయాలి. చట్టాలు, నిర్బంధాలు, హింసలతో పౌరులను చికాకు పెడితే ఫలితం రాదు. ప్రభుత్వం ఇప్పటికైనా తమ చట్టం ప్రతాపాన్ని మద్యం అక్రమ వ్యాపారులకు పరిమితం చేసి, పోలీసు అధికారాలను వారిపై మాత్రమే ప్రయోగించాలని అంక్ష విధించి, త్రాగాడన్న అనుమానంతో సగటు పౌరుణ్ని వేధించే యత్నానికి స్వస్తి చెబితే మద్య నిషేధ ఉద్యమానికి ప్రజల మద్దతు లభిస్తుంది. లేకుంటే తెలిసి తెలిసి పోలీసు అకృత్యాలకు ఆస్కారం కల్పించి, అసలు ఆ చట్టంపైనే ప్రజలకు రోత కల్గే ప్రమాదాన్ని కొని తెచ్చుకొంటారు. పౌర జీవితం ఛిన్నా భిన్నం కాబోయే ప్రమాదాన్ని పౌర హక్కుల సంఘాలు, నేతలు ముందుగానే పసిగట్టి, తగిన జాగ్రత్త పడడం అవసరం.

---

### గూడూరు సబ్ జడ్జి కోర్టులో

O.S. 137 / 93

ఇన్డియన్ ఓవర్‌సీస్ బ్యాంకు, గూడూరు -వాది

Vs

నెల్లూరు అరుణ, W/o. దయాకర రెడ్డి -ప్రతివాది

**దావా నోటీసు**

పై నంబరు దావాలో ప్రతివాది నెల్లూరు అరుణకు దావా నోటీసు నిమిత్తము 6.2.95 వ తేదికి వాయిదా వేయబడి వున్నది. సదరు తేదిన ప్రతివాది పై కోర్టులో 10 గంటలకు హాజరు కాని యెడల దావా పరోక్షముగ తీర్మానింప బడునని తెలియ జేయడమైనది.

పి.ఎస్. మదన్‌మోహన్
వాది వకీలు

---

### విజయవాడ Ist అడిషనల్ సబ్ కోర్టులో

O.S. 92 / 94

M/s. Emmer Electronics Pvt. Ltd Vijayawada -వాది

and

M/s. Shehensha Electronics -ప్రతివాది

To

M/s. Shehensha Electronics rept. by its proprietor M.D. Basha alias Shehensha. D.No. 15.197-B-3, Subedar Pet, Near Radha Theatre, N...

... పై వాది ... ఎన్ని మార్లు నోటీసులు చేసినా పుచ్చు కొనందున్న పబ్లికేషన్ నోటీసు నిమిత్తం 31.1.95 తేది వాయిదా వేసినాడు. ఆ రోజు ఉదయం 10 గంటలకు పై కోర్టుకు హాజరై మీ ఆక్షేపణలు తెలుపుకోని యడల మీ పరోక్షమందు తీర్మానించ బడును.

విజయవాడ 1.1.95 — జి. సీతారామం, వాది అడ్వకేట్

---

### షేర్లు

2 పేజీ కొరవ

షేర్ల మార్కెట్ పతనం ఆగి, హా. పునరుజ్జీవనం అంత సుల భసాధ్యమయ్యేట్లు లేదు. విదేశీ సంస్థాగత పెట్టుబడి దారులు (ఎఫ్.ఐ.ఐ) చురుకుగా మార్కెట్‌లో పెట్టుబడి పెడితే తప్ప షేర్ల ధరలు పెరిగే సూచనలు కన్పించడం లేదు. గత రెండు రోజులుగా వారు టాటా, రిలయన్స్, బజాజ్, హెచ్‌డిఎఫ్‌సి షేర్ల పట్ల ఆసక్తి చూపుతున్నట్లు చెప్తున్నారు. ప్రైస్ ఎర్నింగ్ మల్టిపుల్స్ 15 నుంచి 20 వరకు వున్న, మౌలికంగా సుదృఢమైన చాలా కంపెనీల షేర్లు మార్కెట్‌లో లభ్యమౌతుండడంతో వీరు మళ్లీ ఉత్సాహం ప్రదర్శి స్తున్నారని అంచనా. మెక్సికో దేశంలో ఆర్థిక సంక్షోభం, వారి మారక ద్రవ్యం 'పెసో' ను దివాల్యా చేయడం వంటి సంఘటనలతో విదేశీ సంస్థలు అభివృద్ధి చెందుతున్న ఇండియా వంటి దేశాల విషయంలో చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తున్నాయి. మెక్సికో ఆర్థిక సంక్షోభపు నీలి నీడలు భారతీయ మార్కెట్‌లో పలు రకాలుగా దర్శన మిస్తున్నాయి.

స్వదేశీ ఇన్వెస్ట్‌మెంట్ సంస్థలు, త్వరలో జరగనున్న ఆరు రాష్ట్రాల శాసన సభ ఎన్నికల ఫలితాల కోసం నిరీక్షిస్తున్నాయి. అర్జున్ సింగ్ దురంతం కేంద్ర ప్రభుత్వ మనుగడపై ఏమాత్రం ప్రభావం చూపుతుందన్న అంశాన్ని కూడా వీరు నిశితంగా పరిశీలిస్తున్నారు. అందువల్లనే వారు కొనుగోలు, అమ్మకాలలో పెద్దగా పాల్గొనడం లేదు.

చిన్న పెట్టుబడి దారులు, మార్కెట్‌లోకి కుప్ప తెప్పలుగా వచ్చి పడుతున్న ప్రైమరీ ఇష్యూల వైపు తమ దృష్టి మళ్లిస్తున్నారు. అందువల్ల వారూ సెకండరీ మార్కెట్‌లలో పెట్టుబడిని తగ్గించారు.

ఈ అన్ని కారణాల వలన రానున్న కొద్ది వారాలలో మార్కెట్ ఇదే స్తబ్దతతో వుండవచ్చునని అంచనా.

18 తేది బొంబాయి ఇండెక్స్ కొద్దిగా మెరుగై (18.05 పాయింట్లు) 3,654.35 పాయింట్ల దగ్గర క్లోజ్ అయింది.

గత సంవత్సర కాలంలో చూసతే ఇండెక్స్, 1994 సెప్టెంబర్ 12 తేది అత్యధిక స్థాయికి - 4643 పాయింట్లకు పెరిగింది; అతి తక్కువ స్థాయికి - 3346 పాయింట్లు- డిసెంబర్ 24 తేది పతనమైంది. ఆ పతనం చూసి, హర్షద్ మెహతా స్కాం సమయంలో వలె ఇండెక్స్ 2500 పాయింట్లకు పడి పోతుందని కొందరు భయపడ్డారు. కాని ఆ ప్రమాదం జరగకుండా, కొత్త సంవత్సరం ఆరంభం నుంచి నెమ్మ మెల్లగానైనా మార్కెట్ పుంజుకోవడం సంతోషించ దగిన విషయం. ఇండెక్స్ తగ్గినా - స్కాంలో వలె అన్ని షేర్ల ధరలూ పడిపోక పోవడం, మౌలికంగా మంచి కంపెనీల షేర్లు తమ ధరలను నిలకడగా కాపాడుకోవడం ఇక్కడ గమనించాల్సిన విషయం.

కొత్తగా సెకండరీ మార్కెట్‌లో పెట్టుబడి పెట్టే ఇన్వెస్టర్లు మార్చి ఆఖరు వరకు ఆచి, తూచి వ్యవహరించడం మంచిది.

---

### జనవాణి

3 పేజీ కొరవ

ఆయన ఈ మధ్య జరిగిన ఆంధ్రప్రదేశ్ ఎన్నికలను సమీక్షిస్తూ, రాజకీయాలు అసంబద్ధమైన, నమ్మదగని వాళ్ల రంగంగా మారిందని వ్రాశారు. ఇంకా మాట్లాడితే పరిహాసమైన, హేళన పూర్వమైన రంగంగా మారిందని వివరించారు. పదిలమైన రాజకీయాల్లో నీతి నిజాయితీలతో కడవరకు నిలిచే వాళ్లుగా కొంత మందిని మాత్రమే చెప్పవచ్చు. రానురాను రాజకీయాలు దిగజారి పోతున్నాయి.

నెల్లూరు - బి.వి.రాధాకృష్ణయ్య

---

### నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ కొరవ

వరకు దానికి సంపాదకుడుగా వుండినారు.

రాజగోపాల రెడ్డి గారికి భార్య, ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు వున్నారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

#### విద్యానగర్‌కు మళ్లీ డాక్టర్ ఐ.గోపాలరెడ్డి

జవహర్ లాల్ నెహ్రూ టెక్నలాజికల్ విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ ఐ.గోపాల రెడ్డి తన పదవీ విరమణా నంతరం మళ్లీ విద్యానగర్ విద్యా సంస్థల నిర్వాహకుడిగా తిరిగి వచ్చారు. విద్యానగర్ ఇంజనీరింగ్ కాలేజి ప్రిన్సిపల్‌గా ఆయన ఆ సంస్థను ఎంత అద్భుతంగా తీర్చి దిద్దింది అందరికి తెలుసు. ఉక్కు వంటి క్రమశిక్షణను నెలకొల్పి ఉన్నత విద్యా ప్రమాణాలు సాధించి రాష్ట్రంలోనే వుత్తమ ఇంజనీరింగ్ కాలేజిగా పేరు తెచ్చారాయన. ఆ కృతజ్ఞతతో ఇప్పుడాయన్ను తమ విద్యా సంస్థ లన్నింటికి డైరెక్టర్‌గా నియమించారు జనార్దన రెడ్డిగారు.

గోపాలరెడ్డి గారి నిర్వహణకు రావడం ఆ విద్యా సంస్థల అదృష్టం.

#### కావలి డిఎస్‌పి బదలీ

కావలి డిఎస్‌పి శ్రీ మాణిక్యాల రావును బదలీ చేసి, శ్రీ గణపతి రావును నియమించారు. ఎమ్మెల్యే శ్రీ కలికి యానాది రెడ్డికి వ్యతిరేకంగా ఓడిపోయిన అభ్యర్థి శ్రీ వంటేరు వేణుగోపాల రెడ్డి చేయించిన బదలీ ఇది. యానాది రెడ్డి ఇటువంటి ఎదత్త వూపులకు బెదురుతాడా?

#### నెల్లూరుకు డిఇటి బదులు టిడిఎం

నెల్లూరు టెలికాం డివిజన్ను జిల్లా స్థాయికి పెంచారు. ఇకనుంచి డిఇటి బదులు టిడిఎం - టెలిఫోన్ డిస్ట్రిక్ట్ మేనేజర్ వుంటారు. కొత్త టిడిఎంగా శ్రీ ఎం.ఆర్.ఎస్. నాగకుమార్ నియమితు లైనారు. ఆయన ఇండియన్ టెలిఫోన్ సర్వీసెస్‌కు చెందిన అధికారి.

అధికారి స్థాయి పెరిగినందుకైనా టెలిఫోన్ల సర్వీసు మెరుగు పడుతుందా?

#### ఒమ్మినకు బొంబాయి రైల్వే సభ్యత్వం

ఒమ్మిన సుబ్రహ్మణ్యం గారిని బొంబాయిలోని సెంట్రల్ రైల్వే జోనల్ వినియోగ దారుల సంఘం సభ్యుడుగా నియమించారు. సౌత్ సెంట్రల్ రైల్వే జోనల్ కమిటీ మెంబరుగా శ్రీ ఒమ్మిన సుబ్రహ్మణ్యం చేసిన సేవలను గుర్తించి, రైల్వే మంత్రి శ్రీ జాఫర్ షరీఫ్ ప్రత్యేకంగా ఆయన్ను ఆ పదవికి ఎంపిక చేశారు. రెండేళ్లు కాలపరిమితి కల్గిన సభ్యత్వం ఇది.

#### రేబాల కౌసల్యమ్మ మరణం

విడవలూరు సంపన్న కుటుంబీకుడు, జిల్లాలో పేరు పొందిన భూస్వామ్య కమతం కల్గివుండిన రేబాల బలరామ రెడ్డిగారి భార్య శ్రీమతి రేబాల కౌసల్యమ్మ 7 తేది మరణించారు. ఆమెకు ఐదుగురు కుమారులు, ఒక కుమార్తె. కుమారు లందరూ కాంట్రాక్టు రంగంలో దేశవ్యాప్త ప్రాచుర్యం పొందారు. ఎంత సంపద వున్నా, ఎంత వున్నతికి ఎదిగినా మిడిసిపాటు లేని బుద్ధిమంతులు వారు. వారి వినయం, నిరాడంబరత్వం అభినంద నీయమైనది. వారి కుటుంబానికి మా సానుభూతి

---

## శివారెడ్డి పద్యాలు

### శ్రీ దువ్వూరు జానకిరామిరెడ్డి నిర్యాణం

పేదసాదలంటెప్రేమవాత్సల్యము
కనులుగప్పుతారుకవితలంటె
దూరమాయెభువికిదువ్వూరుజానకి
రామిరెడ్డితిరిగిరాడుయింక.

అయిపోయిందిటైము,అవసానకాలమ్ము
దగ్గరైంది,త్వరలోదాటుకుంట
నిన్నుకలుసుకుంటనీకుఅండగావుంట
ఎత్తిపెట్టుసీటుఎగువకవికి.

---

### పంచాంగం

జనవరి తిథులు

పుష్య బహుళ

| | | |
|---|---|---|
| తే21శని | పంచమి రా.గం. | 1.00వ |
| తే22ఆది | షష్ఠి రా.గం. | 11.32వ |
| తే23సోమ | సప్తమి రా.గం. | 9.40వ |
| తే24మంగళ | అష్టమి రా.గం. | 7.38వ |
| తే25బుధ | నవమి సా.గం | 5.25వ |
| తే26గురు | దశమి సా.గం. | 3.00వ |
| తే27శుక్ర | ఏకాదశి ప.గం. | 12.26వ |

స్వయంపాకుల శ్రీనివాసులు ...

# తడ చెక్‌పోస్ట్‌లో తొలి రోజే పెద్ద చేప చిక్కింది!

సూళ్లూరు పేటలో అధికార పార్టీకి చెందిన ప్రముఖ నాయకులకు సారా, బ్రాందీ వ్యాపారాలతో ప్రత్యక్ష సంబంధమున్నదన్న విషయం అందరికీ తెలిసిందే. అధికారులపై అవసరమైతే జులుం, లేకుంటే లంచమిచ్చి ఇంతవరకు వ్యాపారం చేసిన ఘన చరిత్ర వారికుంది. సంపూర్ణ మద్య నిషేధం విధించడంతో పెద్ద ఎత్తున అక్రమంగా మద్యాన్ని మద్రాసు నుండి తీసుకు రావాలను కున్నారు. కానీ భీమిని వారి పాళెం చెక్‌పోస్టులో ఎక్సైజ్ అధికారులు వారిని పట్టుకొన్నారు. తమ మనుషులను నిర్బంధించిన అధికారులపై జులుం చేసి విడిపించుకొని వెళ్లారు. కాని ఎక్సైజ్ అధికారులు వైర్‌లెస్‌లో ఈ విషయాన్ని జిల్లా వున్నతాధి కార్లకు తెలియ జేయడంతో గత్యంతరం లేక మళ్లీ తమ మనుషులను లొంగిపోయేట్లు చేశారు. మొత్తానికి పోటాపోటీగా జరిగిన ఛేజ్ 16 తేది రాత్రి తడ మండలంలోని భీమునివారి పాళెం చెక్‌పోస్టు వద్ద జరిగింది. రాష్ట్రంలో మద్య నిషేధం విధించడంతో సరిహద్దులో అధికారులు తనిఖీ తీవ్రం చేశారు. ఈ సమయంలో మద్రాసు నుండి వస్తుండిన ఎపి 26 టి 3017 నంబరు కారును అనుమానించిన ఎక్సైజ్ సిఐ మల్లెం కొండయ్య ఆపి తనిఖీ చేశారు. కారులో బాగ్ పైపర్, ఓల్డ్ టావరిన్, మార్కోపోలో, నెపోలియన్ కంపెనీల మద్యం 479 బాటిళ్లు కంట పడ్డాయి. తప్పించుకు పోతున్న కారు ఓనరు, డ్రైవరు శ్రీనివాసన్, వెంగయ్య నాయుడ్ని అరెస్ట్ చేసి కారును అధికారులు సీజ్ చేశారు. తమిళనాడులో తమ సొంత షాపు నుండి సూళ్లూరుపేట లోని షాపుకు ఈ మద్యాన్ని తెస్తున్నట్లు విచారణలో తెలిసింది. కస్టడీలో తమ మనుషులు వున్నారని తెలిసిన వెంటనే సూళ్లూరుపేట లోని ప్రముఖ నాయకుడు వచ్చి అధికారులతో గొడవ పడి వారిని కారులో ఎక్కించుకొని

## జిల్లావార్తలు

వెళ్లినట్లు తెలిసింది. కాని నిందితుల సంతకాలు, కారుకు సంబంధించిన రికార్డులు సీజ్ చేయడం వల్ల ఎక్కడ ఇరకాటంలో పడతామోనని నిందితులను మంగళవారం లొంగిపోయేట్లు చేశారు. మద్య నిషేధం విధించిన తొలి రోజే జరిగిన సంఘటనలో పెద్ద మొత్తంలో సరుకు లభ్యం కావడం చర్చనీయాంశ మయింది. అక్రమ రవాణాను ఛాలెంజ్‌గా తీసుకొని పనిచేసి, తమ సత్తా ఏమిటో చూపిస్తా మంటున్నారు అసిస్టెంట్ ప్రొహిబిషన్ సూపరింటెండెంట్ మోహన్ లాల్. దీనికోసం ప్రతి వాహనం తోపాటు సైకిల్ కూడా తనిఖీ చేయకుండా వదలి పెట్ట మంటున్నారు. ఈ విధానం వల్ల మద్యం విషయంలో కొంత మేరకు మేలు జరిగినా ప్రతి సూట్‌కేసు, సంచి, బ్యాగు చెక్ చేయడం వల్ల విలువైన వస్తువులతో వచ్చే వారికి సెక్యూరిటీ సమస్య తలెత్తె ప్రమాదం వుంది. అధికారులు ఈ సమస్యను ఏ విధంగా పరిష్కరిస్తారో ? ఏది ఏమైనా అక్రమ వ్యాపారుల తొలి సవాల్‌లో అధికారులనే విజయం వరించింది.

### కావలిలో 15 ప్రాదేశిక నియోజక వర్గాలు

కావలి మండల పరిధిలోని పంచాయతీలను 15 ప్రాదేశిక నియోజక వర్గాలుగా విభజించారు. 3,500 జనాభా వున్న పంచాయతీలను ప్రాదేశిక నియోజక వర్గాలుగా ఏర్పాటు చేసినట్లు ఎమ్డిఓ డివి రమణయ్య చెప్పారు. కొత్తపల్లి, మద్దూరు పాడు, రుద్రకోట, చలంచర్ల, చెన్నాయ పాళెం, ఆనెమడుగు, సర్వాయ పాళెం, తుమ్మల పెంట, మన్నంగి దిన్నె, బుడంగుంట, గౌరవరం, ముసునూరు, పూలదరువు, తాళ్లపాళెం, అన్నగారి పాళెంలను ప్రాదేశిక నియోజక వర్గాలుగా చేశారు.

# పంచాయితీల సొమ్మ అన్న ఆంక్షలకు ఖర్చు!

రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక శాఖ ట్రెజరీలకు జారీ చేసిన వుత్తర్వులు గ్రామ పంచాయతీలలో సైతం ప్రతి చిన్న పనికి అడ్డంకిగా నిలుస్తున్నాయి. రాపూరు మేజర్ గ్రామ పంచాయతీ పరిధిలో ప్రధాన వీధులైన కొత్తపేట, లక్ష్మీపురం, పడమట వీధి, బజారు వీధి, ఇస్లాం పేట, సత్యమ్మ గుంట, కదియాల పాళెం, అగ్రహారం కట్టల్లో గత కొన్ని రోజులుగా వీధి లైట్లు వెలగడం లేదు. అంధకారంతో ప్రజలు పడరాని పాట్లు పడుతున్నారు. పంచాయతీ పరిధిలోని బావులకు గిలకలు, దూలాలు కూడా దెబ్బ తిన్నాయి. ఈ సమస్యల గూర్చి ప్రజలు అధికారులకు విన్న వించుకొంటే గమ్మున చేతు లెత్తేస్తున్నారు. దబాయించి అడిగితే ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం పంచాయతీ వుద్యోగుల జీతాలకు మినహా మరే విధమైన ఖర్చులకు పెట్టే బిల్లులు ట్రెజరీలో చెల్లుబాటు కావడం లేదంటున్నారు. దీనివల్ల చిన్నా, చితక పని కూడా ఎక్కడి కక్కడ ఆగిపోతూంది. ఇదే ధోరణి కొన్నాళ్లు సాగితే పంచాయతీ లన్నీ గబ్బు పట్టిపోవడం ఖాయం. అత్యవసర పనులకైనా పంచాయతీ బిల్లులు ట్రెజరీల్లో చెల్లుబాటు అయ్యేలా తిరిగి ప్రభుత్వం వుత్తర్వు జారీ చేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

### విద్యానగర్ విద్యార్థుల ప్రతిభ!

కావలి జవహర్ భారతి కళాశాలలో డాక్టర్ పివి రామచంద్రారెడ్డి మెమోరియల్ ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్ర స్థాయి వక్తృత్వ పోటీలో విద్యానగర్ ఎన్‌బికెఆర్ సైన్స్ అండ్ ఆర్ట్స్ కళాశాల విద్యార్థులు ప్రతిభ చూపి బహుమతులు పొందారు. ఎన్నికల సంస్కరణల వల్ల ప్రజాస్వామ్యం దెబ్బ తింటుందా? అనే అంశంపై నిర్వహించిన పోటీలో కళాశాల బిఎస్‌సి ఫైనల్ ఇయర్ విద్యార్థి ఒ.వెంకట రత్నం, ద్వితీయ సంవత్సరం విద్యార్థి మార్టిన్ లియో పాల్ సంయుక్తంగా ప్రథమ బహుమతి పొందారు. గూడూరు డిఆర్‌డబ్ల్యు విద్యార్థినులు ద్వితీయ బహుమతి పొందారు. మెమోరియల్ రోలింగ్ షీల్డ్ స్థాపించి నప్పటి నుండి జిల్లా విద్యార్థులు పొందడం ఇదే మొదటిసారని కళాశాల ప్రిన్సిపాల్ జి. సుబ్రహ్మణ్యం చెప్పారు.

# రాపూరులో దొంగ నోట్లు

రాపూరులో ఇటీవల కాలంలో దొంగ నోట్ల పంపిణీ ముఠా సంచరిస్తూంది. కొందరు వ్యాపారస్తులను తమ ముఠాలో చేరమని, ఒక వంతు నోట్లకు ఆరు వంతులు దొంగ నోట్లు ఇస్తామని ప్రలోభ పెడుతున్నట్లు తెలుస్తూంది. ఈ ముఠా సభ్యులు కొందరు వారం క్రితం ప్రత్యేకంగా ఒక కారులో వచ్చి పలువురు వ్యాపారులను కలిసికొని వెళ్లారు. బుచ్చి, గూడూరు, వెంకటగిరి, నెల్లూరులలోని తమ ఏజెంట్లు ఎటువంటి ఇబ్బందులు లేకుండా సాఫీగా వ్యాపారం చేసుకొంటున్నారని, అదే బాటలో నడవమని రాపూరు వ్యాపారులను కోరినట్లు వినికిడి. 10, 20, 100 రూపాయల దొంగ నోట్లు ఈ ముఠా వద్ద విరివిగా వున్నాయట. ఎవరికీ అనుమానం రాని విధంగా ముఠా రాత్రి వేళల్లో వ్యాపారస్తులతో మంతనాలు జరుపుతుంది. కర్ణాటక రాష్ట్రం నుంచి ఈ ముఠా సభ్యులు వచ్చినట్లు చెబుతున్నారు. ఏది ఏమైనా ఆశ్యాశకు పోతే రాపూరు వ్యాపారస్తులు నష్టపోవడం తోపాటు ప్రజలను ఇబ్బంది పెట్టిన వారవుతారు. పోలీసు తగిన శ్రద్ధ తీసుకొని ముఠా గుట్టును రట్టు చేయవలసిన అవసరం వుంది.

### ప్రజా సంక్షేమ సమితి సమావేశం

తోటపల్లి గూడూరు మండలం కోడూరు మండల ప్రజా సంక్షేమ సమితి 31 తేదీ హరిజన, గిరిజన, బలహీన వర్గాల సమావేశం కోడూరులో ఏర్పాటు చేస్తుంది. గ్రామ పంచాయతీ ఎన్నికల్లో ఏకాభిప్రాయ సాధన, మంగల ప్రాతినిధ్యం, జిల్లా ప్రాదేశిక ఎన్నికలపై సూచనలు, సలహాలు ఇవ్వ వచ్చంటున్నారు సమితి కార్యదర్శి ఐ.మాధవరావు

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ.50/-
విడిప్రతిరూ. 2/-

# అల్లూరు జాతరలో చిందులేసిన మాతమ్మ

జాతర, తిరునాళ్లలో మాతమ్మల చిందుల దురాచారాన్ని రూపు మాపాలని ప్రభుత్వం లక్షలాది రూపాయలు ఖర్చు చేస్తుంటే, కొందరు అధికారుల ఉదాసీనత వల్ల ఈ దురాచారానికి మళ్లీ అల్లూరులో అంకురార్పణ జరిగింది. అల్లూరులో ఈనెల 10 తేది పోలేరమ్మ, 13 న మహాలక్ష్మమ్మ, 14 తేది [illegible] వుత్సవాలు జరిగాయి. జిల్లాలో మాతమ్మల దురాచారాన్ని అరికట్టేందుకు ద్యూటీస్ స్వచ్ఛంద సంస్థతో కలసి సాంఘిక సంక్షేమ శాఖ లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టి వృత్తి మానిన వారికి పలు వృత్తి విద్యలలో శిక్షణ యిప్పించి రుణాలు కూడా మంజూరు చేయించింది. ఈ కార్యక్రమాలు పూర్తయిన పిమ్మట జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివరావు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం వల్ల జిల్లాలో ఎక్కడా మాతమ్మ చిందులు కనపడ లేదు. ఒక దురాచారం రూపు మాసి పోయిందన్న ఆనందం అభ్యుదయ వాదు లందరిలో వుండింది. కాని 10 తేది అల్లూరు గ్రామ దేవత పోలేరమ్మ జాతర రోజు రెవిన్యూ, పోలీసు అధికారుల సమక్షంలో దురాచారం యధాతథంగా జరిగింది. జాతరకు ప్రత్యేకంగా భారీ బందోబస్తు ఏర్పాటు చేశారు. నిన్న, మొన్నటి వరకు అల్లూరు ఎస్‌ఐ మాజీ ఎమ్మెల్యే బంటుగా వ్యవహరించే వాడు. జాతరను తెలుగుదేశం వర్గాలు నిర్వహించడంతో ఆ వర్గాల మన్ననలు పొందేందుకు మాతమ్మ చిందులు చూస్తూ వూరకుండినట్లు తెలుస్తోంది. రెవిన్యూ వర్గాలు కూడ ఇదే ధోరణిలో ఆలోచించడం వల్ల నశించి పోయిందన్న దురాచారం మళ్లీ

[illegible] 8 పేజీలో

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ 100/-
అర్ధసంవత్సర చందా రూ 50/-
విడిప్రతి రూ. 2/-



## ప్రకటన

**నరసరావు పేట ప్రిన్సిపల్ సబ్ ఆర్డినేట్ జడ్జి కోర్టులో**

O.S. 376 / 85 :: E.P. 124 / 88

M/s. జయా కెమికల్స్, గుంటూరు
- DHr

మరియు

M/s. రైతు డిపో, మేడికొండూరు
- JDr

పై నంబరు దావాలో JDr కు పూర్తి హక్కులు కలిగి కోర్టు వారిచే జప్తిహారు చేయించబడి 31.1.95 తేదిన వేలం కావలసిన స్థిరాస్తి వివరం.

డిక్రీ షెడ్యూలు దాఖలా 2, 5, 6 మరియు 7 అయిటములు.

2. అసిస్మెంటు నంబరు 317 రులో 4500 చ.అ. లలో వున్న డాబా ఇల్లు మరియు దానికి అంటి వున్న పెంకు వరండా మరియు ఖాళీ స్థలమునకు

హద్దులు: తూర్పు: - సి.హెచ్. శేషయ్య మరి ఇతరులు; దక్షిణం: పంచాయితీ రోడ్డు; పడమర: వై. కోటేశ్వర రావు మరి ఇతరులు, ఉత్తరం: R & B రోడ్డు

DHr విలువ రూ. 20,000/-
అమీనా విలువ రూ. 1,10,000/-

5. D.No. 384/1 రులో య 2.04 ట్లు, మరియు D.No. 405 రులో య. 2.00 ట్లు సదరు మొత్తం ఒక ప్లాటుగా వున్నాయి. 4.04 ట్లకు హద్దులు: తూర్పు, ఎమ్. బ్రహ్మయ్య; దక్షిణం: ఎమ్. సత్యం: పడమర: పి. ప్రసాదు: ఉత్తరం: బి. తిరుపతయ్య

DHr విలువ రూ. 15,000/-
అమీనా విలువ రూ. 60,600/-

6. డి.నం. 788 - 1A లో 5.85 ట్లకు హద్దులు. తూర్పు - వాగు: దక్షిణం: వి. సాంబశివ రావు: [illegible]: వుత్తరం: ఎమ్. రామకోటి

జడా విలువ రూ. 20,000/-
అమీనా విలువ రూ. 87,750/-

7. డి. నం. 353/1 లో య 6.65 ట్లు పూరా.

DHr విలువ. రూ. 30,000/-
అమీనా విలువ రూ. 1,00,200/-

వేలం జరుగు తేది: 31.1.95

జయకవి రమణమూర్తి
DHr తరఫు అడ్వొకేట్

## నెల్లూరు సంగతులు

4వ పేజీ తరువాయి

శైలజకి విధిస్తామని వివరించారు. మద్యం తాగేందుకు పర్మిట్ వున్నవారు కూడా బార్లు, వసతి గృహాల్లో త్రాగడం నేరమేనన్నారు. వైద్యరీత్యా పర్మిట్ల మంజూరులో అవకతవకలకు సివిల్ సర్జన్లు పాల్పడితే కఠిన చర్యలు తీసుకొనేందుకు వెనుకాడమని. వైద్యాధికారి సర్టిఫికెట్ మంజూరుచేసినా అనుమానం వస్తే తిరస్కరించే అధికారం ఎక్సైజ్ సూపరింటెండెంట్‌కు వుందన్నారు. మద్య నిషేధాన్ని పటిష్టంగా అమలు చేసేందుకు జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్ నాయకత్వాన రెవిన్యూ సిబ్బందికి ప్రత్యేక అధికారాలు కల్పిస్తున్నట్లు చెప్పారు. ఇందుకోసం కలెక్టరేట్‌లో ప్రొహిబిషన్ సెల్ ఏర్పాటు చేస్తున్నామని; ఎమ్మార్వో, ఎమ్డీవో, వి.ఎ.ఓ. మద్యనిషేధ అధికారులుగా తమ వంతు బాధ్యత నిర్వహిస్తారని పేర్కొన్నారు. ప్రతి గ్రామంలో గ్రామస్తులతో ఒక ప్రొహిబిషన్ కమిటీ ఏర్పాటు చేయనున్నట్లు కలెక్టర్ తెలుపుతూ ఈ కమిటీల్లో పొదుపులక్ష్మి గ్రూపుకు చెందిన 50శాతం మంది మహిళలు వుంటారన్నారు. ఒక ఉపాధ్యాయుడిని కన్వీనర్‌గా నియమించి జనచైతన్య కేంద్రాలు, ఆరోగ్యదీపంలో పనిచేసే వారిని కమిటీ మెంబర్లుగా నియమించనున్నట్లు చెప్పారు. అక్రమ మద్య విక్రేతల నుండి సభ్యులకు ఎటువంటి అపద సంభవించకుండా ప్రభుత్వం పూర్తి సహాయ సహకారాలు అందిస్తుందన్నారు.

మద్య నిషేధాన్ని పటిష్టంగా అమలు చేసే బాధ్యతను పోలీస్ శాఖ ఛాలెంజ్‌గా స్వీకరించి పనిచేస్తుందని సమావేశంలో పాల్గొన్న ఎస్‌పి. చెప్పారు. ఎక్సైజ్ శాఖ సూపరింటెండెంట్ దివాకర్ కూడా సమావేశంలో పాల్గొన్నారు.

### ఎఫ్‌సిఐకి సొంత గోడౌన్లు!

93-94 సంవత్సరంలో 1.98లక్షల టన్నుల ధాన్యాన్ని సేకరించి నిల్వచేయడంలో ఎఫ్‌సిఐ జిల్లాశాఖ రికార్డు సృష్టించినట్లు సంస్థ జిల్లా మేనేజర్ జి.ఎస్. గోపినాథ్ చెప్పారు. ఎఫ్‌సిఐ 30వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని బృందావనంలోని సంస్థ కార్యాలయంలో 16తేది ఏర్పాటైన సభలో మాట్లాడారు. రైతుల నుంచి పెద్ద మొత్తంలో ధాన్యాన్ని సేకరించడమేకాదు; రైతులు అమ్మిన ధాన్యానికి సరైన గిట్టుబాటు ధరను చెల్లిస్తూ వినియోగ దారులకు నాణ్యమైన బియ్యాన్ని అందించాం. సేకరించిన ధాన్యం, గోధుమల్లో 213లక్షల టన్నులు నిల్వ వుంచేందుకు సెంట్రల్ వేర్ హౌసింగ్ కార్పొరేషన్ గోడౌన్లు సమకూర్చుకొన్నట్లు చెప్పారాయన. కాకుటూరు వద్ద 17.36 ఎకరాల స్థలంలో త్వరలో ఎఫ్‌సిఐ గోడౌన్ కాంప్లెక్స్ నిర్మిస్తున్నట్లు వివరించారు. జిల్లాలో ఈ యేడాది ఏర్పాటు చేసి 14 కేంద్రాలు రైతులకు గిట్టుబాటు ధర చెల్లించి ఎంతగానో వుపయోగ పడినట్లు తెలిపారు. 1965లో రెండువేల కోట్ల రూపాయల బడ్జెట్‌తో ఆవిర్భవించిన ఎఫ్‌సిఐ వ్యాపారం ఆరువేల కోట్లరూపాయలకు పెరిగినట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా నెల్లూరు శాఖ చీఫ్ మేనేజర్ ఎం.వి.ఎస్. సూరిబాబు, మిల్లర్స్ అసోసియేషన్ అధ్యక్షులు హజరత్తయ్య తదితరులు పాల్గొన్నారు.

### వికలాంగులకు జైపూర్ కృత్రిమ కాళ్లు

జస్టిస్ అన్సారి మెమోరియల్, నెల్లూరు వికలాంగుల సంస్థ సంయుక్త ఆధ్వర్యంలో అవసరమైన వికలాంగులకు ఉచితంగా జైపూర్ కాళ్లు అమరుస్తారు. ఈ శిబిరం ఈ నెల 25 తేది నుండి 28 తేది వరకు జరుగుతుంది. అవసరమైన వారు నెల్లూరు పెద్దాసుపత్రిలో 21 తేది నుండి చూపించుకొని పేర్లు నమోదు చేసుకోమని జస్టిస్ అన్సారి కుమార్తె, అల్లుడు ఫరీదా, హుస్సేన్ కోరుతున్నారు. ఈ కార్యక్రమానికి జైపూర్‌నుండి ముగ్గురు డాక్టర్లు,14మంది నిపుణులు తరలివస్తున్నారు. 100 మందికి ఈ కాళ్లు అమర్చే వీలున్నదట. జిల్లా కలెక్టర్ సతీష్ చంద్ర, ఇతర జిల్లా అధికార బృందం ఈ కార్యక్రమానికి సహకరిస్తున్నట్లు నిర్వాహకులు తెలిపారు.

### శనివారం మాంసం దొరకదు

టౌన్‌లోని మున్సిపల్ చేపల, మాంసం మార్కెట్లలో వున్న జంతువధ శాలలను ఇకనుండి ప్రతి శనివారం మూసివేస్తారు. ఆరోజున పట్టణంలోని అన్ని మార్కెట్లలోనూ, దుకాణా లలోనూ, మాంసం విక్రయాలు చేయకూడదని మునిసిపల్ ఆరోగ్యాధికారి టి. సుబ్బారెడ్డి చెప్పారు ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం శనివారం జాతీయ సెలవు దినాల్లో చేపలు, మాంసాన్ని విక్రయించే మార్కెట్లు, దుకాణాలు మూసివేసేందుకు దుకాణదారులకు, మార్కెట్ల కాంట్రాక్టర్లకు నోటీసులు జారీచేస్తారట. నిబంధనలు ఖచ్చితంగా అమలు పరిచేందుకు తగిన చర్యలు తీసుకొన్నట్లు వివరించారు. చెప్పడం కాదు, ఈ పనిచేయడం చాలాకష్టం. సుబ్బారెడ్డిగారి ప్రతాపం ఏ మేరకో రెండు మూడు వారాలు ఆగి చెబుతాం.

### త్యాగరాజ ఆరాధనోత్సవం

బాలాజీ నగర్ సీతా రామస్వామి మందిరాన త్యాగరాజ ఆరాధనోత్సవాలు ఈ నెల 21 తేది జరుగనున్నాయి. త్యాగరాజును స్మరణకు తెచ్చేందుకు యువగాయకులతో సాయంకాలం మూడు గంటల నుండి కచ్చేరి ప్రారంభించ నున్నారు. కుమారి రాళ్లపల్లి గాయత్రి, శ్రీమతి దుర్గా రాజ్యలక్ష్మి, కురువాడ లలితమ్మ, ఎం. రాజలక్ష్మి, ఎం. శారద, లక్ష్మి సుప్రియ, ప్రభావతి, సుమతి, పద్మ, వి. శ్రీధర్, వి. గాయత్రిల గాత్ర కచ్చేరి చేస్తారు. శ్రీమతి ఎం. హేమలత, కె. సుగుణ, ఉష, ఆర్.ఎస్. పద్మావతిల వీణ, జి.ఎన్. ప్రసాద్ వేణుగాన కార్యక్రమం కూడా వుంది. వుదయం నవాబుపేట చిన్నయ్య బృందం నాదస్వర కచ్చేరి, స్వామి వారి పూజ, పంచరత్న గోష్టి వున్నట్లు నిర్వాహకులు తెలిపారు.

### ఉచిత హోమియో వైద్య శిబిరం!

బ్యాంక్ ఆఫ్ ఇండియా వారి సౌజన్యంతో నెల్లూరు రోటరీ క్లబ్ వుచిత హోమియో వైద్య శిబిరాన్ని ఏనుగ సుందర రామిరెడ్డి కళ్యాణ మండపంలో నిర్వహిస్తుంది. ఈ నెల 21, 22 తేదీల్లో జరిగే ఈ శిబిరంలో శ్వాసకోశ, అలర్జీ వ్యాధులకు డాక్టర్ పి.మదన్ మోహన్, కంప్యూటర్ హోమియో క్లినిక్ బృందం రోగులను పరీక్షించి వుచితంగా మందులు పంచి పెడతారు. 21 తేది రక్త పరీక్ష 22 చికిత్స చేస్తారని నిర్వాహకులు తెలిపారు.

### వికలాంగులను ఆదుకోండి

17 తేది వరాదుపల్లి పిసి నగర్ వికలాంగుల కాలనీ ముఖ ద్వార శిలా ఫలకాన్ని ఇఫ్కో ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి ఆవిష్కరించి మాట్లాడారు. ఆర్థికంగా, సాంఘికంగా అతి దయనీయ పరిస్థితులలో అలమటిస్తున్న అవిటి, చెవిటి, కుష్టు వారిని ఆదుకొని కూడు గుడ్డ నీడ కల్పించడం ప్రభుత్వ బాధ్యత; సాంఘిక సంస్థలు, సమాజ సేవకులు, దాతలు దీనికి సహకరిం చాలన్నారాయన. సభకు ఆచార్య పి.సి. రెడ్డి అధ్యక్షత వహించారు. ఐవిఎస్ నాయుడు స్వాగతం పలుకగా వ్యవ స్థాపకురాలు డాక్టర్ కె. రాజమ్మ, పి.సి. సుబ్బరాయుడు కొండా బలరామిరెడ్డి తదితరులు పాల్గొన్నారు. అగ్రా కృష్ణమూర్తి సభారంభంలో ప్రార్థనా గీతం ఆలపించారు.

### పటిష్టంగా అమలుకు పలు సూచనలు!

సంపూర్ణ మద్యనిషేధాన్ని పటిష్టంగా అమలు పర్చేందుకు పలు సూచనలతో జిల్లాకు చెందిన పలు స్వచ్ఛంద సంస్థలు, ప్రజా సంఘాలు, మహిళా సంఘాలు 16తేది జిల్లా కలెక్టర్‌ను కలసి వినతి పత్రం సమర్పించాయి. 3స్టార్, 5స్టార్ హోటల్లను సంపూర్ణ మద్య నిషేధం నుంచి మినహాయించరాదని. విదేశీయులకు, మాజీ సైనికులకు మినహాయింపు ఇవ్వరాదని కోరారు. కల్లును కూడా నిషేధించాలని, డాక్టర్ సర్టిఫికెట్ పేరుతో త్రాగడానికి అనుమతించడం సబబు కాదని సూచించారు. రాష్ట్రంలో మత్తు పానీయాల ప్రవాహాన్ని నిరోధించాలని. మత్తు పానీయాల వుత్పత్తి నిషేధించాలని. కాపుసారా తయారీని అరికట్టాలని కోరారు. ప్రతి ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలో అడిక్షన్ సెంటర్లను ఏర్పాటు చేయాలని విజ్ఞప్తి చేశారు. వుద్యమంలో పాల్గొన్న స్వచ్ఛంద సంస్థలు, మహిళా సంఘాలతో కమిటీని ఏర్పాటు చేయాలని కలెక్టర్‌కు సూచించారు. కలెక్టర్‌ను కలుసుకొన్నవారిలో గండవరపు సేతురామిరెడ్డి, తిక్కవరపు సుకుమార్ రెడ్డి, అరగబోయిన శ్రీనివాసరావు, వి.రమణమ్మ, సి.హెచ్.జయలక్ష్మి వున్నారు.

### 50 ఏళ్లక్రితం

3 వపేజీ తరువాయి

పారుదల సౌకర్యము లేక పేదతనంలో మునిగివున్నదనియు చెప్పిరి. ఈ తాలూకాలోని అన్ని గ్రామాలను సదరు ప్రాజెక్టు క్రింద చేర్చుమని తీర్మానించిరి. తాలూకా సంఘ ఎన్నికలు జరిగెను. 12 మందితో ఒక కమిటీ ఏర్పడినది.

దానికి బొల్లు చెంచునరిసింహులు శెట్టిగారధ్యక్షులు, మల్లిరెడ్డి ఆదినారాయణరెడ్డిగారు కార్యదర్శిగా ఎన్నుకొనిరి.

**లేగుంటపాడు**

డిసెంబరు 27 తేదిన గ్రామీయులు 'కాంతామతి' నాటకాన్ని ప్రదర్శించిరి. తత్సందర్భంలో యువకవి శివారెడ్డి శేషురెడ్డిగారిని శుద్ధఖద్దరు వస్త్రాలతో సన్మానించిరి. తత్సందర్భమున కవిగారు ఆశువుగా కొన్ని పద్యములజెప్పిరి. వాటినుండి మచ్చుకొకటి:-

''కవులసత్కరించు కమ్మనికాలమ్ము
మాయమయ్యెకృష్ణరాయుతోనె
తెనుగుసీమనిన్ననేడుగాననలేత్ర
నాయి దొంటిపోల్కినవ్వుటచట''

చిరాయురస్తు -ఒ.వి.

### నెల్లూరు ముచ్చట్లు

టవున్ కూరగాయల మార్కెట్టులో 13తేదివాడు యెరువస్తె ఉత్తరాయణ పుణ్యకాలం రాలేదని 14తేది వరకు మునిసిపాల్టీవారల్లె వుంచారు.

హెల్తుశాఖవారికి కాయగూరల అవసరం అర్థంకాదు కాబోలు?

* * *

లేగుంటపాడు కామ్రేడులారా? యువకవి శివారెడ్డి శేషురెడ్డిమీదకు కయ్యానికి కాలు దువ్వుతున్నారటనే: వాదబలంతో గెలవాలెగాని. రౌడీజంతోనా గెలిచేది?

**జిల్లావార్తలు**

7 పేజీ తరువాయి

కొనసాగింది. ఇన్‌ఛార్జి కలెక్టర్‌కు ఈ విషయం తెలిసింది. కాని ఆయన కూడా ఎందువల్లో మౌనం వహించారు. మరి ఈ దురాచారాన్ని అరికట్టె నాధుడే లేడా?

### రాపూరులో 2,704 మంది ఓటర్ల నమోదు

స్థానిక సంస్థల ఎన్నికలకు గాను 2,704 మంది కొత్త ఓటర్లు నమోదయ్యారు అదే విధంగా ఓటర్ల లిస్టు నుంచి 522 మందిని తొలగించారు. 5971 మంది ఓట్ల కోసం దరఖాస్తు చేసుకోగా అన్ని గ్రామాల్లో సమగ్ర పరిశీలన జరిపి 2,729 మంది దరఖాస్తులు తిరస్కరించినట్లు ఎమ్మార్వో జి. కొండయ్య చెప్పారు.

సినిమా సినిమా సినిమా సినిమా సినిమా

## అంకయ్య గౌడ్ మళ్లీ నిర్మాత

రావుల అంకయ్య గౌడ్ గతంలో కొన్ని సినిమాలు నిర్మించిన విషయం చాలా మందికి గుర్తుండే వుంటుంది. చాలాకాలం క్రితం సీమ కుక్కలు కొనుక్కోడానికి మద్రాసు వచ్చిన ఈయన అకస్మాత్తుగా చిత్ర నిర్మాత అయిపోయారు. ఇప్పుడీయన సారధ్యంలో " కాలేజి కుర్రాడు-విలేజి అమ్మాయి" అనే చిత్రం గూడూరు, గుంటూరు, హైదరాబాద్ పరిసరాలలో చిత్రీకరింప బడుతుంది. సాయిప్రకాష్‌గా కన్నడంలో 45 చిత్రాలకు దర్శకత్వం వహించిన ఎన్రెడ్డి ప్రకాశ్‌రెడ్డి ఈ చిత్రానికి దర్శకుడు. మార్చి చిత్రాన్ని విడుదల చేయాలను కుంటున్నట్లు నిర్మాత బి. మోహన్ రెడ్డి చెప్పారు.

### కృష్ణ 300 చిత్రం "తెలుగువీర లేవరా"

" అల్లూరి సీతారామ రాజు" చిత్రంలో శ్రీశ్రీ రాసిన " తెలుగువీర లేవరా ఔ దీక్ష బూని సాగరా" గీతానికి జాతీయ స్థాయిలో అవార్డు వచ్చిన విషయం చాలా మందికి గుర్తుండే వుంటుంది. కృష్ణ నటించే 300 వ చిత్రానికి అదే మకుటంగా నిర్ణయించారు.



దొరబాబు చిత్రంలో శోభన్‌బాబు, ప్రియారామన్

## అజారుద్దీన్‌ను తన ఆకర్షణతో క్లీన్ బౌల్డ్ చేసిన సంగీతా బిజిలాని!

ప్రముఖ బ్యాట్స్‌మన్, భారత్ క్రికెట్ జట్టు కెప్టెన్ అయిన అజారుద్దీన్ బాలకృష్ణ వంటి కొందరు యువ హీరోలకు బాల్య స్నేహితుడు. అందుకే హైదరాబాద్‌లో జరిగే సినిమా కార్యక్రమాలలో వీలున్నప్పుడల్లా పాల్గొంటూంటాడు. రెండు నెలల క్రితం ఇతన్ని ' క్యాచ్' పట్టింది బొంబాయి నటి సంగీతా బిజలాని. ఇద్దరికీ తెలిసిన ప్రముఖు డొకడు ఇచ్చిన పార్టీలో కలుసుకున్నారు. ఆమె విసిరిన స్పిన్ బాల్‌కు తట్టుకోలేక అజారుద్దీన్ 'క్లీన్ బౌల్డ్' అయిపోయాడు. ఇది వన్‌డే మ్యాచ్‌లా ముగియ లేదు. ఇద్దరూ అడపాదడపా కలుసుకుంటూనే వున్నారు. ఇటీవల బొంబాయిలోని ఒక పేరుమోసిన హోటల్లోని కాటేజ్‌లో ఇద్దరూ రోజున్నర పాటు గడిపారు.

అజారుద్దీన్ వివాహితుడు. ఇద్దరు బిడ్డల తండ్రి. ఎంతో ప్రశాంతంగా జీవయాత్ర సాగిస్తున్న ఆయన జీవితంలో ఇప్పుడు తుఫాన్ చెలరేగింది. మన క్రికెట్ జట్టులోని వారు, అతను ఉద్యోగం చేసే స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా సహోద్యోగులు ఎంత హితవు చెప్పినా అతను పట్టించుకునే స్థితిలో లేదు. సంగీతా బిజలానీ కూడా లోగడ హీరో సల్మాన్ ఖాన్‌తో నాలుగైదేళ్లు ప్రేమాయణం వెలగ బెట్టి ఇప్పుడు ఏకాకి అయిపోయింది. అజారుద్దీన్ దొరికాడు. పర్యవసానం ఏమిటో త్వరలో మనకు తెలుస్తుందిగా!

## ఎస్పీ బాలు కుమార్తె ప్రేమ పెళ్లి

ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం పుత్రిక పల్లవి నిశ్చితార్థం డిసెంబర్ 30న మద్రాసులో నిరాడంబరంగా జరిగింది. వరుడు సతీష్ పాతకోట్ల బాలు మిత్రుడైన 'శ్రీరాం గ్రూప్ కంపెనీ ఛైర్మన్' ఎ.వి.ఎస్. రాజా పుత్రుడు. పల్లవి న్యూయార్కులో 'రేడియాలజీ' చదువుతున్నపుడు అక్కడ మెడిసన్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేస్తున్న సతీష్‌తో పరిచయం ఏర్పడి, అది ప్రణయంగా పరిణమించి, జూన్‌లో తిరుపతిలో పరిణయానికి శుభ ముహూర్తం నిశ్చయమయ్యేలా చేసింది. శుభం!

### నేపథ్య గాయకుడి పుత్రుని దుర్మరణం

నేపథ్య గాయకుడు మను ( నాగూర్ బాబు) మూడేళ్ల కొడుకు ఇంటి ముందు ఆడుకుంటూన్న వాడల్లా అక్కడున్న డ్రైనేజ్‌లో ఎప్పుడు పడ్డాడో గాని, ఆ తర్వాత అక్కడే శవమై తేలాడు. అల్లారు ముద్దు బిడ్డ ఇలా దుర్మరణం పాలైనందుకు మను దంపతులకు కల్గిన ఖేదం అంతా ఇంతా కాదు.

## కమలాకరుడికి కెవి రెడ్డి అవార్డు

ఎన్నో అవార్డులకు, రివార్డులకు అర్హులైన సీనియర్ డైరెక్టర్ కమలాకర కామేశ్వర రావుకు డైరెక్టర్ కె.వి. రెడ్డి మెమోరియల్ అవార్డు 1994 సంవత్సరానికి గాను అక్కినేని నాగేశ్వరరావు ద్వారా ప్రదానం చేయబడుతుందని హైదరాబాద్ 'కళావాహిని' అవార్డు కమిటీ అధ్యక్షుడు జి.ఎన్. రెడ్డి తెలిపారు.

## లక్ష్మీపార్వతి కథ తెరకెక్కుతూంది!

### " లక్ష్మీపార్వతి"

మన ముఖ్యమంత్రి సతీమణి పేరుతో ఒక సినిమా తయారవ బోతోంది. " రాజకీయ రంగం నేపథ్యంలో కథ సాగుతుంది," అన్నారు డైరెక్టర్ సునీల్ వర్మ. ఈ చిత్రంలో రాజ్‌కుమార్, విజయ్, ఆలీ, బ్రహ్మానందం, అమృత పాత్ర ధారులు. ఈ టైటిల్ ప్రేరణతో ముఖ్యమంత్రి సతీమణి పేరున ఊరగాయలు, డిటర్జెంట్ పౌడర్లు వచ్చినా మనం విస్తుపో నక్కర్లేదు.

### చిత్ర పరిశ్రమాభి వృద్ధి అవకతవకలపై విచారణ

నాలుగయిదేళ్లుగా రాష్ట్ర ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌లో అనేక అక్రమాలు జరిగాయని, ముఖ్యంగా ఛైర్మన్‌తో సహా బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లు కొందరు కోట్లకొద్దీ తీసుకున్న అప్పులను తిరిగి చెల్లించక పోవడం, ఒకదాని కోసం తీసుకున్న రుణాలను మరొక దానికి దుర్వినియోగం చేయడం, ఛైర్మన్ ఎం.ఎస్. రెడ్డి హైదరాబాద్‌లో డబ్బింగ్ థియేటర్‌కు గాను పొందిన స్థలాన్ని వైశ్యా బ్యాంక్‌కు అద్దెకు ఇవ్వడం వంటివరకు సమంజసమని, ఈ విషయమై ప్రభుత్వం ఒక కమిషన్ వేసి విచారించాలని దాసరి నారాయణ రావు డిమాండ్ చేశారు. ఇలా వచ్చిన పలు ఆరోపణలపై రిటైర్డ్ హైకోర్టు న్యాయమూర్తి చేత విచారణ జరిపించడానికి ప్రస్తుత ప్రభుత్వం నిర్ణయించినట్లు తెలుస్తోంది.

### 1995లో నాగార్జున అయిదు చిత్రాలు

" ఈ యేడు నావి తెలుగులో మూడు, హిందీలో రెండు చిత్రాలు విడుదలవుతాయి," అన్నాడు నాగార్జున. హిందీలో రోజ్ మూవీస్ వారి " అంగారే" చిత్రంలో ఈయన తోపాటు అక్షయ్ కుమార్ హీరో అట; రెండో చిత్రం " క్రిమినల్". హిందీ వెర్షన్‌కు మహేష్ భట్ సోదరుడు ముఖేష్ భట్ నిర్మాత. విడుదల చేసే తొందరలో తెలుగు వెర్షన్‌లో చాలా పొరబాట్లు జరిగాయి. హిందీ సెకండాఫ్‌లో చాలా చేర్పులు మార్పులు చేశారు. ఇది ఫిబ్రవరిలో విడుద లవుతుంది. హిందీ చిత్రం హిట్ కావచ్చు " అన్నాడు నాగార్జున.

## చిలకపచ్చ కాపురం

### అతుకుల బొంత కథ, అవాస్తవికతల చెత్త!

**చిత్రసమీక్ష**

తెలుగు సినిమాలు వాస్తవికతకు ఎంత దూరంగా పరుగెత్తి పారి పోతున్నాయో ' చిలకపచ్చ కాపురం' చిత్రం కళ్లకు కట్టినట్లు చూపించింది. జీవిత వాస్తవాలను యథాతథంగా తెరకెక్కిస్తే చూడడానికి హాలు లోపల ప్రేక్షకు లుండరని అందరికీ తెలుసు; కాని ప్రేక్షకుడ్ని కాల్పనిక జగత్తులో విహరింప జేయడంలోనూ కొన్ని నియమాలు, నిగ్రహం పాటించాలి కదా?

పూర్తి గ్రామీణ వాతావరణంలో, కోనసీమ అందచందాల నేపథ్యంలో మోతుబరి రైతుల పంతాలు, పట్టింపుల ఆధారంగా అల్లిన యువతీ యువకుల ప్రేమ కథా చిత్రం ఇది. బుల్లెబ్బాయ్, పరశురామయ్య బావా బావమరుదులు; ఇద్దరూ సంపదతో తెగ బలిసిన వారే. చిన్న విషయంలో ఇద్దరి మధ్య పట్టింపు లొస్తాయి. దానితో ఆ గ్రామం రెండుగా చీలిపోతుంది. కృష్ణయ్య - ఆ గ్రామస్తులందరి ఆదరణ పొందిన పేద యువకుడు. పడవపై గ్రామస్తులను ఏరు దాటించడం అతడి వృత్తి. పరశురామయ్య కూతురు సత్యవతి అతడ్ని ప్రేమిస్తుంది: కాని కృష్ణయ్య మాత్రం బుల్లెబ్బాయ్ ఉంపుడు కత్తెగా తెచ్చుకొన్న రాధను ప్రేమిస్తాడు. ఇద్దరి మధ్య దాగుడు మూతలాట, గ్రామ కక్షల రీత్యా మధ్యలో కృష్ణయ్య తల్లికి అవమానం జరగడం, ఆమె చావు, బుల్లెబ్బాయ్ చెర నుంచి రాధను విడిపించి కృష్ణయ్య పెళ్లాడటం ఈ సినిమా కథ. కథాంశంలో సారం లేకపోయినా, కథనం సక్రమంగా నడిపి వుంటే అంత బోర్ కొట్టి వుండేది కాదు. కాని, రీళ్లు గబగబా చుట్టేయాలన్న తొందర తప్ప ఏ మాత్రం సినిమా మీద శ్రద్ధ లేకపోవడంతో రీలుకు రీలుకు మధ్య పొంతన లేదు. అతుకుల బొంతవలె తయారైంది సినిమా.

కృష్ణయ్య చదువు సంధ్యలు లేని నిరుపేద కుటుంబికుడు. అతడ్ని గొప్పింటి సత్యవతి ఎందుకు

10వ పేజీలో

# 4 వేల ఏళ్లనాడే

4 వపేజీకొరవ

ల్లూరు జిల్లాలో మొట్ట మొదటగా క్రీ.శ. 1757 సంవత్సరంలో కల్నల్ ర్క్ అనే ఆంగ్లేయుడు రిపోర్ట్ చేశారు. పూరుకు నెల్లూరుకు మధ్య న్నానదికి ఆనకట్ట వేసే సమయంలో క్కడ త్రవ్వకాలు జరిపినప్పుడు ట్టితో చేసి కాల్చిన శవపేటిక యల్పడినది. అందులో బయల్పడిన త్రలు ఎరుపురంగు, నలుపు రంగు, రెండు నలుపురంగు పాత్రలు నపరినట్లుగా వివరించారు. అటువంటి వపేటికలు తొన్నవాడ గ్రామంలోని క్ కట్ బరియల్స్‌లో కనిపించాయి. పూరు గ్రామంలో కూడా ఈ ... కనుగొనబడ్డాయి.

ఈ ప్రాంత బృహత్ లాయుగపు సమాధుల్లో అత్యంత ాముఖ్యత గలిగిన సమాధులు న్నవాడలో వున్నాయి. అక్కడ ానవుడు బొంతరాతిని ఒక బార్ కారంలో సుమారు 2 మీటర్ల తువరకు త్రవ్వి అడుగున చదును సి అక్కడ మట్టితో కాల్చిన వపేటికను వుంచి అందులో అస్థికలు దితర సామాగ్రి ఉంచారు. ఈ మాధులను పురావస్తు ప్రదర్శనశాలల ఖ అధికారి శ్రీ. సూర్యనారాయణ జు త్రవ్వి పరిశీలన గావించారు. ఈ మాధి లోపల చక్కగా చదును చేసిన లపై శవపేటిక ఒక ప్రక్కగా ట్టబడి వున్నది. మృణ్మయ పాత్రలు రుసగా పేర్చి వున్నాయి. తిపూసలు. ఇనుముతో చేసిన ాదుకాళ్ళ స్టాండ్, త్రిశూలము, దీపం ుంట్లనవి అందులోలభిoచాయి. శ్రీ సూర్యనారాయణరాజు కథనాన్ని ునసరించి ఈ సమాధులు క్రీ.పూ. 3 శాబ్దానికి చెంది వుండవచ్చునని లుస్తున్నది. అటువంటి సమాధులు రళ రాష్ట్రంలోని పోర్కాలమ్, పెరమ్, ంకలి అనే చోట్ల కనుగొనబడ్డాయి. రెక్కడా ఇవి కనిపించక పోవడం ల్ల పోర్కాలమ్ వాసులు అక్కడికి రలివచ్చి వుంటారని అభిప్రాయం. శ్రీ ంకటేశ్వర విశ్వవిద్యాలయంనకు ందిన డాక్టర్ కె.పి.రావు పోర్కాలమ్ ాసులకు తొన్నవాడ వాసులకు మధ్య ముద్రం ద్వారా వర్తక వాణిజ్యాలు రిగి వుండవచ్చునని విశ్వసిస్తున్నారు.

ఈ సమాధులు ఇంకా నెల్లూరు ల్లాలో కుమ్మరిగుంట, ఉచ్చూరు, ప్పాయపాళెం, వెల్లంపల్లి, కలిగిరి, కలి పలస, నాపూరు, ప్రభుగిరి ట్నం, వీరంపల్లి, ... కల్లూరు, అన్నంబేడు, కోవూరు, గూడలి, వడసింహాల కొండ, ఆదిరాఘవపురం మొదలగు ప్రదేశాలలో కనుగొనబడ్డాయి.

అయితే ఇంత పెద్ద పెద్ద సమాధులను ఎందుకు నిర్మించారు అనే విషయాన్ని గురించి ఆలోచించి నట్లయితే ఈ కాలంనాటి ప్రజలు "ఎవరైనా చనిపోతే, చనిపోయిన తరువాత కూడా వారిలో జీవం వుంటుందని" గట్టిగా నమ్మేవారు. అందువల్లనే ఈ సమాధులలో అస్థికలతో పాటు అనేక రకాల ఆహార పదార్థాలను కుండలలో వుంచి సమాధులలో పెట్టేవారు. వారు వాడిన పనిముట్లు కూడా వారికి వుపయోగ పడతాయని తలచి, వాటిని కూడా అందులో పెట్టేవారు. ఇంతవరకు పురావస్తు శాఖవారు త్రవ్విన అనేక సమాధులు ఈ విషయాన్ని ధృవీకరిస్తున్నాయి.

ఈ కాలపు ప్రజలకు చిత్ర లేఖనాలు వెయడం, రాతిపై రేఖా చిత్రాలు గీయడం తెలుసు. దొరవారిసత్రం మండలంలోని కల్లూరు గ్రామంలోని బృహత్ శిలాయుగపు సమాధి చుట్టూ అమర్చిన బండలపై జింకలు, నక్క, వారి మత సంబంధమైన బొమ్మలు కూడా రేఖా మాత్రంగా గీసి వున్నాయి. ఆంధ్రదేశంలో ఇటువంటి చిత్రాలు చాగటూరు, చిన్నమారూరు, (మహబూబ్ నగర్‌జిల్లా) గ్రామాలలో కలవు.

మరొక విశేషం ఈ కాలం నాటివిగా చెప్పబడుతున్న ఎంత్రోఫో మార్ఫిక్ ఫిగర్స్ అనే రాతి శిల్పాలు వెరాయపాళెం, గొలగమూడి గ్రామాలలో కనుగొనబడినాయి. ఈ బొమ్మలు వారి మత విషయాలలో ప్రాముఖ్యత నొంది వుండవచ్చు. ఎంత్రోఫో మార్ఫిక్ ఫిగర్స్ అంటే " ఒక రాతిని మానవ ఆకారంలో, శారీరక భాగాలు ఏవీ స్పష్టంగా లేకుండా చెక్కి వుంచడం. ఇటువంటివి చిత్తూరు, వరంగల్, ఖమ్మం, కృష్ణా జిల్లాలలో లభ్యమైనాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ఈ బృహత్ శిలా యుగం క్రీ.పూ.1000 సంవత్సరాల నుండి క్రీ.శ. 4 వ శతాబ్దం వరకు సాగిందని పురాతత్వ వేత్తల అభిప్రాయం. తొన్నవాడలోని సమాధులు క్రీ.పూ. 500 సంవత్సరాల నుండి క్రీ.పూ. 300 సంవత్సరాల కాలంనకు చెంది వుండవచ్చు. అందుకోసం వీటిపై సమగ్ర పరిశీలన జరపవలసి వున్నది. మానవ చరిత్రలో చీకటి యుగంగా భావింపబడుతున్న కాలం క్రీ.పూ. 1500 సంవత్సరాల నుండి క్రీ.పూ.300 సంవత్సరాల మధ్యకాలానికి సంబంధించిన వివరాలు ఈ సమాధుల పరిశీలనలోనే లభించవచ్చునని పలువురి విశ్వాసం.

## ప్రాచీన చారిత్రక యుగము

ఈ యుగం క్రీ.పూ. 400 సంవత్సరాల నుండి క్రీ.శ. 400 సంవత్సరాల వరకు గల చరిత్రను ముఖ్యంగా మౌర్య, శాతవాహన, ఇక్ష్వాకుల కాలం నాటి చరిత్రను తెలుపుతున్నది. అయితే ఈ కాలానికి సంబంధించి శాసనాలు కాని లిఖిత పూర్వక ఆధారాలు కాని లభింపక పోవడం వల్ల పురావస్తు ఆధారాల సహాయంతో ఈ కాలపు చరిత్రను పరిశీలించడం జరిగింది.

నెల్లూరు జిల్లాలో జరిపిన పురాతత్వ పరిశోధనలలో ఇప్పటివరకు దాదాపు 36 ప్రాచీన చారిత్రక కాలం నాటి నివాస స్థలాలు ( పాటిదిబ్బలు) కనుగొనబడ్డాయి. ఈ పాటిదిబ్బలే మనకు ముఖ్య ఆధారాలుగా ఉన్నప్పటికీ ఇవి ఎక్కువ భాగం వ్యవసాయ పనులలో నేల మట్టం గావించ బడ్డాయి. వీటిలో అతి ప్రాచీన మయినది దువ్వూరు గ్రామంలోని పాటిదిబ్బ నివాసం. క్రీ.పూ. 2000 సంవత్సరాల నుండి నేటి వరకు నిరంతరంగా సాగుతున్నదని చెప్పేందుకు కావలసినన్ని ఆధారాలు వున్నాయి. ఇటువంటి ప్రాచీన స్థలాలు నెల్లూరులో పెక్కు వున్నాయి. నూతన శిలాయుగపు రాతి గొడ్డళ్ళు, మిల్కి క్వార్ట్జ్ రాతి పై చేసిన బ్లేడులు లభ్యమైనాయి. ఈ పాటి దిబ్బను గ్రామస్థులు త్రవ్వేటప్పుడు అనేక రకాలైన పూసలు, నాణెములు, విగ్రహాలు, రుబ్బురు రాళ్లు, ఇటుకరాతి కట్టడాలు బయల్పడ్డాయి. వీటిలో ఎక్కువ భాగం బుచ్చిరెడ్డిపాళెంలోని డాక్టర్ సీతారామారావు ఆధీనంలో భద్రపరచబడి వున్నాయి.

(కొరవ పై వారం)

స్పందన కల్గించిందో మనకు తెలియదు. ఆ గ్రామంలో చీమ చిటుక్కుమన్నా పరశురాంకు తెలిసిపోతుంది. కాని సత్యవతి అందరి ఎదుటా పడవలో కృష్ణయ్యపై పడి పొర్లికింతలు పెట్టినా ఆయన తెలుసుకోలేదు. ఆమె పుష్పవతి అయిన సందర్భాన్ని సాంప్రదాయ బద్ధంగా, శాస్త్రోక్తంగా నిర్వహిస్తారు. చాపమీద ఆడవాళ్ల మధ్య కూర్చున్న ఆమెను కృష్ణయ్య బుగ్గ గిల్లి, పైన బడినంత పనిచేసి ఆట పట్టిస్తూ, పాట పాడుతుంటే అందరూ చూస్తుంటారు; అభ్యంతర పెట్టరు. ఆమె హోలీ పండుగలో కృష్ణయ్యతో కలిసి వీధుల్లో కౌగిలింతలాట ఆడినా ఎవరూ చూడరు.

రాధ, ఉంపుడు కత్తెగా మారిన వ్యవహారం మరీ ఎబ్బెట్టుగా వుంది. ఆమెను రేప్ చేయడానికి బుల్లెబ్బాయ్ పడవలో యుద్ధం సీను సృష్టించడం కృత్రిమంగా కాదు - వికృతంగా వుంది. కృష్ణయ్య వంటి ఒంటరి వాడిని తప్పించుకొని, ఒక ఆడపిల్లను రేప్ చేయడానికి బుల్లెబ్బాయ్ నంటి విలన్ బాంబులతో యుద్ధం చేస్తాడా? అతడి కామె మీద కామం తప్ప, మరే విధమైన సెంటిమెంటూ లేదు. ఆమె కోసం అతడు ప్రాణాలకు తెగించ మానభంగం చేయాల్సిన అగత్యమేముంది?

తన వుంపుడుకత్తెను మగ పురుగు కూడా చూడడానికి లేదని ఆంక్ష విధించిన బుల్లెబ్బాయ్, ఆమె పనీ పాటా చూడడానికి కృష్ణయ్య వంటి వయస్సులో వున్న పోరగాణ్ణి ఎందుకు నియమిస్తాడు? ఏమో దర్శకుణ్ణి అడగాలి! బుల్లెబ్బాయ్, పరశురాంల పాత్రల రూపకల్పన దర్శకుడికి చేత కాలేదు. కృష్ణయ్య పాత్ర చాలా చోట్ల అసందర్భంగా ప్రవర్తిస్తుంది.

జగపతి బాబు (కృష్ణయ్య) చాలా మొరటుగా వున్నారు. నటనలో వైవిధ్యం లేదు. మీనా, సౌందర్యలకు తమ అంద చందాలు విరబోసి చూపడం తప్ప నటనకు అవకాశం లేదు. చరణ్‌రాజ్, కాస్ట్యూమ్ కృష్ణ ( బుల్లెబ్బాయ్, పరశురాం) తమ పరిధిలో బాగా నటించారు. అంతర్వేది రేవులోని గోదావరి అందాలను, కోనసీమ పచ్చదనాన్ని వాడుకోవడంలో కెమెరా విఫలమైంది. ఒక్కపాటా వినదగి లేదు. ఆకెళ్ల మాటలు బాగానే వ్రాశారు. సంగీతంలో సొంపు లేదు.

ఈ చిత్రానికి దర్శకుడు కోడి రామకృష్ణ అని టైటిల్స్‌లో చూసి తెలుసు కోవలసిందే; చిత్రం లోని ఏ సన్నివేశమూ అతడి శైలిని, అనుభవాన్ని ప్రతి ఫలించదు.

చిత్రసమీక్ష
9 పేజీ కొరవ

ప్రేమించిందో, ఏ సంఘటన ఆమెలో

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ.50/-
విడిప్రతిరూ. 2/-

## సుహృద్భావ సమావేశము - 2

నెల్లూరు జిల్లా ఆర్యవైశ్య సంఘ అధ్యక్షుని ఎన్నిక 29.1.95 తేదిన జరుగు సందర్భములో 9.1.1995 ఒక సమావేశము జరిగినది. పలువురు శ్రేయోభిలాషులు ప్రతి మండలము నుండి ముఖ్యులను 22.1.1995 న నెల్లూరులోని క్లాత్ మర్చంట్స్ అసో సియేషన్ హాలు ఆచారి వీధి నందు ఉదయం 10.00 గంటలకు సమావేశ పరచ వలెనని ఏకగ్రీవముగా తీర్మానించినారు. జిల్లా నుండి యాభై మంది సభ్యులతో ఒక కమిటీని ఏర్పరచి వారి నిర్ణయ ప్రకారము ఏకగ్రీవ ఆమోద యోగ్యుడైన అభ్యర్థిని జిల్లా సంఘ అధ్యక్షునిగా నిర్ణయించుటకు తీర్మానించి యున్నారు. కావున నెల్లూరు జిల్లాలోని ఆర్యవైశ్య మహాసభ జీవిత సభ్యులు 22.1.1995 పై సమావేశమునకు యీ ప్రకటననే అహ్వానముగా భావించి విచ్చేసి ఆర్యవైశ్య సంఘ శ్రేయస్సుకు తోడ్పడ వలెనని ప్రార్థించడమైనది.

అల్పాహార విందు

నెల్లూరు
17.1.95

అయితా ఆనందకృష్ణయ్య
కన్వీనరు
ఆర్యవైశ్య సంఘ శ్రేయోభిలాషులు

## ఉత్తరక్రియలు

మా తండ్రి

పెనంపురం ఆదినారాయణయ్య గారు

దగదర్తి

5.1.95 తేది గురువారం స్వర్గస్థులైనారు.

వారి ఉత్తరక్రియలు

25.1.95 తేది బుధవారం శిలాప్రతిష్ఠ, బ్రాహ్మణ బియ్యాలు దగదర్తిలో మా స్వగృహమున జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుటాము.

-పెనంపురం గిరిబాబు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press, OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,